# అందరికీ నమస్కరించి.....

'శ్రీవాణి' ని ప్రశంసిస్తూ అనేకమంది ప్రముఖులు లేఖలు వ్రాస్తున్నారు. స్థలాభావంవలన అన్నింటినీ ప్రచురించ లేకపోతున్నాము. అన్యధా భావించకండి. ఒకమాటలో చెప్పాలంటే శ్రీవాణి **Award picture** లాగే వున్నది. అవార్డు పిక్చర్స్‌కు ప్రశంసలు, సర్టిఫికేట్లకు లోటు ఏమాత్రం వుండదు. అయితే లక్ష్మీప్రసన్నం మాత్రం తక్కువే అని చెప్పక తప్పదు. 'శ్రీవాణి' లో వాణి (సరస్వతి) ప్రభావం బాగానేవున్నది. అయితే శ్రీ (లక్ష్మి) మాత్రం కనుపించడంలేదు (లోటు బడ్జెట్టు).

ప్రస్తుత పరిస్థితులలో పత్రికలు నడపడం బహుకష్టం. పేపరు ధరలు రోజురోజుకు పెరిగిపోతున్నాయి. అందులో ఒకస్థాయిగల సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యాపత్రికలు నడపటం చాలాకష్టం. ఈ వాస్తవాన్ని అందరూ అంగీకరిస్తూనేవున్నారు. ఏ సౌధం నిలబడాలన్నా ముఖ్యంగా నాలుగుస్థంభాలూ మరియు దూలాలు బలిష్ఠంగావుండాలి. అదే విధముగా ఐదు తరగతుల ప్రజలు సహకారం అందించినప్పుడే ఆ పత్రికనాలుగుకాలాలపాటు బ్రతికి బట్టకడుతుంది. 1. అభిమానించే పాఠకలోకం. 2. ప్రకటనలుయిచ్చే వ్యాపారస్థులు, పారిశ్రామికవేత్తలు. 3. పత్రికను విక్రయించే ఏజంట్లు. 4. ప్రోత్సాహమిచ్చే విరాళదాతలు. 5. రచయితలు.

శ్రీవాణిని అభిమానించే సహృదయులు ఒక్కొక్కరు కనీసం ఒకమిత్రునితో సంవత్సరచందా చేర్పించుతారని ఆశిస్తున్నాను. రచయితలు తమ అమూల్యమైన రచనలను, వ్యాపారస్థులు మరియు పారిశ్రామికవేత్తలు తమ ప్రకటనల **(Advertisements)**ను పంపి శ్రీవాణిని తీర్చిదిద్దుతారని విశ్వసిస్తున్నాను. సహృదయులైన ఉదార స్వభావులు జీవిత చందాలు, విరాళములుపంపి శ్రీవాణికి ఆర్థిక స్తోమతను కలుగజేస్తారని నమ్ముతున్నాను. ఏజంట్లు శ్రీవాణికి మంచి ప్రచారంయిచ్చి మార్కెట్‌లో ఎక్కువ కాపీలు అమ్ముడు పోయేట్లుగా ప్రయత్నించుతూ, సకాలంలో బిల్లులు చెల్లించు తారని భావిస్తున్నాను. వీరందరూ ఎవరి పరిధిలోవారు ఒక మంచి పత్రికను నిలబెట్టటానికి అవసరమైన సహకారమును అందించమని అర్థిస్తున్నాను.

**Postal** వారి సహకారంవలన శ్రీవాణి సకాలంలో పాఠకులకు చేరుతున్నందుకు వారికి నా అభినందనలు. అయితే జూన్ సంచిక అందలేదని ఏడుగురు మిత్రులుమాత్రం వ్రాసారు. వారికి మళ్ళీ సంచికలు పంపాలి. నిజంగా పత్రిక గనుక అందకపోతే వ్రాయండి. మళ్ళీ పత్రిక పంపుతాం.

జూలై నెలనుండి శ్రీవాణి సంవత్సరచందా రు 30/-లు. జులై నెలలో చేరిన సంవత్సరచందాదారులకు, ఫిబ్రవరి నుండి జూన్ వరకు వచ్చిన సంచికలు (5 సంచికలు) ఉచితంగా పంపుతాము. కాపీలు పరిమితంగా మాత్రమే ఉన్నాయి. ఈ సదవకాశమును ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను.

ఉత్తమ సాహిత్యాన్ని ప్రోత్సహించండి! శ్రీవాణికి సహకారం అందించండి!!

ధన్యవాదములు.

భవదీయుడు

కొమ్మగిరి కృష్ణమోహనరావు

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

జులై - 1985

సంపుటి 1

సంచిక 7



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



చందా వివరాలు

విడిప్రతి : రు. 2-50

సంవత్సర చందా : రు. 30-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS MACHILIPATNAM

on behalf of

Triveni Publishers Pvt. Ltd. Machilipatnam


## విషయసూచిక

శ్లో॥ వ్యతిషజతి పదార్థా నాంతరః కోఽపి హేతుః
నఖలు బహి రుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే
వికసతిహి పతంగస్యోదయే పుండరీకం
ద్రవతిచ హిమరశ్మావుద్గతే చంద్రకాంతః ॥

సూర్యోదయం అవుతూండగానే పద్మాలు చక్కగా విచ్చుకొంటాయి. అలాగే చంద్రకిరణాలు సోకగానే చంద్రకాంతమనే శిల కరిగిపోతుంది. పద్మాలు వికసించటానికి సూర్యకిరణాలే కావాలి. చంద్రకాంత శిలలు ద్రవించటానికి చంద్రుని వెన్నెలే తగలాలి. ఆయా వస్తువులకు ఆయావస్త్వంతర దర్శన స్పర్శనాదుల వల్ల ఆత్మీయత ఏర్పడుతున్నది. దీనికేదో కనబడని కారణం బలీయంగా వుండి వుండాలి. అదే సృష్టి వైచిత్ర్యం.

# అమృతవాణి

కూచిభట్ల చంద్రశేఖరశర్మ

భగవంతుని సృష్టిని గురించి కాసేపు మనసు పోనిచ్చి విచారిస్తే చాలా తమాషాలు కనబడతాయి. ఇన్ని కోట్ల జీవరాసుల్లో ఒకదాన్ని పోలకుండా మరొకటి ఉండటం ఏదో కొంత భేదం కనబడటం పరికిస్తే భగవంతుని దగ్గర ఎన్ని నమూనాలున్నాయో అనిపిస్తుంది.

ఇంత వైవిధ్యంలోనూ ఒకేవిధమైన ఆత్మ అన్నిట సమానంగా వుంటుంది. శరీరాలు వేరుగానే కనబడతాయి మరి. అయినా ఆ జీవుల్లో వాటిల్లోవాటికి పరస్పర ప్రేమ భావం కలగటం, అది ఒక బంధం కావటం, దానివల్ల, చివరికి ఆ రెండు జీవులకు ఐకమత్యంతో సామరస్యం కుదరటం, యిదంతాచూస్తే ఆశ్చర్యం కలుగుతూంటుంది.

తెల్లారితే యెంతోమంది యెంతమందినో కలుస్తున్నారు, చూస్తున్నారు. అంతమాత్రాన వాళ్ళల్లో పరస్పర ప్రీతి కలుగుతోందని చెప్పలేంకదా? ఒకప్పుడొక వ్యక్తిని మరో వ్యక్తి చూడగానే వాళ్ళ మనసులో ఆర్ద్రభావం కలిగి వారిరువుర్నీ దగ్గరచేస్తుంది. పరస్పర ప్రీతి క్రమంగా పెరుగుతుంది.

ఇలాంటి ప్రీతిభావం కలగటానికి ఆయావ్యక్తుల శరీరాలాకారణమంటే కాదు. వాళ్ళ అందచందాలు, సంభాషణచాతుర్యం, ఇచ్చిపుచ్చుకొనే భావంగాని కారణమా అంటే అదీకాదని అర్థమౌతుంది. ఎందుకంటే యిలాంటి వెన్నివున్నా చివరకు ఒక తల్లిబిడ్డల్లోనే పారస్పరిక ప్రీతి భావం లేకపోవటం మనం ఎక్కువగానే చూస్తున్నాం. ఒకవేళ ప్రీతికలిగినా అది కాలం గడిచినకొద్దీ వలచబడి మరుగైపోతుంది.

అందుచేత ఒకరినొకరు చూడగానే ఒక ఆప్యాయత కలగటం, మనసు ద్రవించటం, యిలాంటివి జరగటానికి ఏదో ఒక బలీయమైన కారణం బయటకు కనబడనిది వుండి తీరాలనటానికి సందేహమేమీ లేదు.

ఈ కారణం అంతరమైందేకాని స్థూల శరీరాలకు సంబంధించింది కాదు. ఈ ప్రీతి ఆత్మీయమైంది. ఆత్మ శాశ్వతం. ఉపాధులు వేరైనా ఆత్మ ఒకటే. ఉపాధి భేదాన్ని బట్టి వేరుగా కనబడుతున్నది. మాయావరణంలో వుండటాన ఆ యాత్మ జీవుడనిపించుకొంటున్నది.

ఇలాంటి జీవుల్లో కలిగే పరస్పర ప్రేమకు కారణమేమిటో తెలిసికోలేకపోవటానికి ఈ మాయే కారణం. అంటే తనకిజ్ఞానం లేకుండానే ఈ ప్రీతి భావాన్ని అనుభవిస్తున్నాడు జీవుడు.

ఈ అనుభూతి ఆ జీవుని సంస్కారంవల్ల కలుగుతున్నది. ఇదే వాసన అంటే – ఈ వాసన జీవుని అంతఃకరణంలో గూఢంగా ఉంటుంది. అది గాలికి కదిలిన పూవులో వాసనలాగా ఒకొక్కవ్యక్తిని చూచినప్పుడు బయటపడుతుంది. ఈ కారణం అంత తేలిగ్గా తోచేది కాదు కనుకనే ఆంతర కారణమన్నారు. దీన్ని కోఽపి అని చెప్పటంలో అనిర్వచనీయమనేది స్పష్టమౌతున్నది.

దుష్యంతుడు దేవలోకంనుంచి తిరిగివస్తూ ఒక ఆశ్రమంలో చిన్నపిల్లవాడైన భరతుని చూచినప్పుడు తన హృదయం ఒక అనిర్వచనీయమైన అనుభూతిని పొంది ఆ బాలుని వదిలి వెళ్ళలేని ఒక ఆత్మీయతా బంధాన్ని కలిగించింది. ఇది వారి శరీరాలకు సంబంధించింది కాదు మరి. వారిరువురి అంతఃకరణలకు సంబంధించినది.

ప్రస్తుతం ఈ శ్లోకం కూడా శ్రీరాముడు లవకుమారుని చూచి తనలో అనుకొన్నదే. దీన్ని భవభూతి చక్కగా తాత్త్విక దృష్టితో వివరించాడు. ఈ స్థితినే కాళిదాసకవి "భావస్థిరాణి జననాంతర సౌహృదాని" అని లోతుగా చెప్పాడు. ●

# సంపాదకీయం

" Knowledge without action is Abortion, action without knowledge is Foolishness "
'కార్యాన్ని సాధించలేని జ్ఞానం నిష్ప్రయోజనం, జ్ఞానరహితమైన కార్యం (పని) మూర్ఖమైనది' అని కీ. శే పండితనెహ్రూ అనుభవంతో చెప్పారు. ఒక్క జ్ఞానమును సంపాదించినందువలననే ప్రయోజనం లేదు. అందులో ఒక్క శాస్త్ర జన్య జ్ఞానం ( Bookish knowledge ) మాత్రమే మానవ పురోభివృద్ధికి సరిపోదు. శాస్త్రాధ్యయనం వలన లభించేది పరోక్షజ్ఞానం మాత్రమే. పుస్తకములు చదవడంద్వారా వచ్చిన పాండిత్యము పరులకు బోధించడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. కేవలం ఇట్టి జ్ఞానంవలన మానవుడు ఉద్ధరించబడడు. పుస్తక జన్యజ్ఞానంతోపాటు విజ్ఞానమునుకూడా సముపార్జించినప్పుడే మానవుని జీవితం సఫలమవుతుంది. విజ్ఞానంలేని విద్య రాణించదు. అనుభవంలేని చదువువలన ప్రయోజనం లేదు. వివేకం లేని విజ్ఞానం ప్రమాదం. లౌకిక జ్ఞానంలేని విద్య నిత్యజీవితంలో ఏమాత్రం ఉపయోగపడదు. విద్య అంటే కేవలం పుస్తకాలు చదవడం, పరీక్షలలో ఉత్తీర్ణులవడం, డిగ్రీలు పుచ్చుకోవడం, అనే అభిప్రాయంతోపాటు ఉద్యోగం కోసమేననే భావన నానాటికి ప్రబలుతున్నది. ఇస్త్రీబట్టలు నలగకుండా, సున్నితమైన, నాజూకైన ఉద్యోగాలుచేస్తూ, ధనం సంపాదించి సుఖవంతమైన జీవితాలు గడపాలనే భావన పెరుగుతున్నది. అటువంటి ఉద్యోగాలు దొరకక పోయేటప్పటికి యువతలో ఒకవిధమైన నిరుత్సాహం కలుగుతున్నది. ఆత్మస్థయిర్యం లేనివారు ఆత్మహత్యలకు సహితం పాల్పడుతున్నారు. ఒకరి క్రింద పని చేయకుండా, స్వేచ్ఛగా, స్వశక్తిమీద, కష్టించి, చెమటోడ్చి సంపాదించాలనే తలంపు మన విద్యావంతులలో యిప్పటికీ కలగకపోవడం దురదృష్టకరం. దీనికి బాధ్యులు ఒక్క విద్యార్థులు మాత్రమేకాదు. వారికి అందిస్తున్న ప్రస్తుత విద్యావిధానం అటువంటిది కావడంవలన, వారు ఆ విధంగా తయారవుతున్నారు. కనుక విద్యావిధాన స్వరూప స్వభావాలు మారాలి. పుస్తక జన్య జ్ఞానంతోపాటు అనుభవజ్ఞానం, ( Practical knowledge ), వివేకజ్ఞానము ( Discrimination knowledge ), లౌకికజ్ఞానము ( Worldly knowledge ) లను సంపాదించిపెట్టేటటువంటి విద్యను నేర్పాలి. లేనియెడల ఎంత చదువుకున్నప్పటికి తనను తాను పోషించుకోలేని పరిస్థితి ఏర్పడుతున్నది. కొత్తగా రూపొందించదలచిన కేంద్రప్రభుత్వ నూతన విద్యావిధాన నమూనామ వెంటనే ప్రకటించాలి. అనుభవజ్ఞులైన మేధావుల సలహాలను ఆహ్వానించాలి. స్వాతంత్ర్యం వచ్చి దాదాపు 39 సం. అయినప్పటికీ సరైన విద్యావిధానాన్ని రూపొందించుకో లేకపోయాం: ఇది నిజంగా దురదృష్టకరం.

అనుభవంద్వారా పొందిన జ్ఞానమును, వివేకంతో దేశకళ్యాణమునకు ఉపయోగించి, విచక్షణతో సద్వినియోగ పరచి, లౌకికంతో వ్యవహరించి అనుభవజ్ఞానమును తిరిగి యింకా పెంపొందించుకోవాలి. దానినే సంపూర్ణమైన 'విజ్ఞానము' అని అంటారు అట్టి విజ్ఞానమును సంపాదించిన వ్యక్తి ఎక్కడికి వెళ్ళినా చలామణి అవుతాడు. ఏ పనినైనా సాధించ గలుగుతాడు. దేశ పురోభివృద్ధికి తోడ్పడగలుగుతాడు. అట్టివారు ఉద్యోగం మీదనే ఆధారపడనవసరంలేదు. కనుక అటువంటి విజ్ఞానము అందించే విద్యను విద్యార్థులకు అందించడం ప్రభుత్వ ప్రప్రథమ కర్తవ్యం. అందుకనే పండిత నెహ్రూ 'కార్యాన్ని సాధించలేని జ్ఞానము నిష్ప్రయోజన' మన్నారు.



# సిద్ధాసనము

దావులూరి రాధాకృష్ణమూర్తి

పద్మాసనము తర్వాత అంత గొప్ప ఆసనము సిద్ధాసనము. కొంతమంది అనుభవం ప్రకారం పద్మాసనము కంటె సిద్ధాసనము ధ్యానమునకు చాలా మంచిది. సిద్ధాసనము అంటే సిద్ధులు పొందే ఆసనము అని కూడ అంటూ వుంటారు. ఈ ఆసనము చాలామంది యోగుల చేత, మహనీయుల చేత అభ్యసింపబడింది కాబట్టి దీనిని సిద్ధాసనము అని అంటారు. దీనినే గౌతమ బుద్ధుడు అభ్యసించి సిద్ధి పొందాడని అందువలన ఈ ఆసనమును బుద్ధాసనము అని కూడ అంటూంటారు.



స్థూలకాయులు ( బాగా పొట్టి తొడలు, పిక్కలు వున్నవారు ) కూడ చాలా తేలికగా ఈ ఆసనమును అభ్యసించవచ్చును. బ్రహ్మచర్యమును అవలంబించ దలచిన వారికి ఇది చక్కని ఆసనము.

చేయు విధానము :-

1. కుడికాలిని మోకాలివద్ద వంచి కుడి మడమను సద స్థానమునకు—జననేంద్రియ స్థానమునకు మధ్యన వుంచవలెను.

2. ఎడమ కాలిని మోకాలివద్ద వంచి మడమను జననేంద్రియ స్థానముపైన వుంచవలెను.

రెండు కాళ్ళ చీలమండలను ఒకదానిపై ఒకటి వచ్చునట్లు పాదములు తొడలకు పిక్కలకు మధ్యలో వుండునట్లు ఏర్పాటు చేయవలెను.

3. కుడి చేతిలో ఎడమ చేతిని అమర్చి నాభి స్థానమునకు మధ్యన చీలమండలంపై ఆనిస్తూ వుంచ వలెను. లేదా పద్మాసనములో వలె చేతులను నిటారుగా వుంచి మోకాళ్ళపై వుంచవలెను.

4. నిటారుగా కూర్చుని కళ్ళు మూసుకుని పొట్ట భాగమును వెనక్కు లాగి రొమ్ములను ముందుకు నెట్టుతూ కూర్చొనవలెను.

5. నెమ్మదిగా గాలిని పీలుస్తూ వదలుతూ ఆసనము నుండి పూర్వ స్థితికి రావలయును.

6. చేతులను నెమ్మదిగా విడిపించవలయును. ( ముందుగా ఎడమ చేతిని తర్వాత కుడి చేతిని )

7. ఎడమ కాలును నెమ్మదిగా చాచి యోగ స్థితికి రావలెను ( అనగా రెండు కాళ్ళు ముందుకు చాచుకుని చేతులను పిరుదల ప్రక్కనే వుంచి నిటారుగా కూర్చునే స్థితి )

8. అదే విధముగా నెమ్మదిగా కుడి కాలును చాచి యోగ స్థితికి రావలయును.

( తరువాయి 16వ పేజీలో )

" యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే "

శ్రేష్ఠుడు ఏయే కర్మమును (పనిని) ఆచరించునో, తక్కిన ప్రజ ఆయాకర్మమునే (ఆయాపనినే) ఆచరించును. ఆ శ్రేష్ఠుడు దేనిని ప్రమాణముగా (ఆదర్శముగా) చేయునో (గ్రైకొనునో) లోకము (జనము) ఆ ప్రమాణమును (ఆ ఆదర్శమును) అనుసరించును.




పూర్వ కాలంలో " యథా రాజా తథా ప్రజా " అను ఆర్యోక్తి ప్రబల ప్రచారంలో వుండేది. అప్పుడు పాలించే రాజులు ఆదర్శమైన జీవితాన్ని గడపాలని ధర్మం శాసించేది. సామాన్యముగ లోకములో ఒక వాడుక వుండేది. పెద్దలేమి చేయుదురో తక్కినవారున్ను దాని ననుసరించుదురు. కాబట్టి శ్రేష్ఠులగువారు, అనగా పెద్దలు మరియు పాలకులు తమ ఆచరణ విషయమై బహు జాగరూకులుగ నుండవలెను. తల్లిదండ్రుల ప్రవర్తన పిల్లలమీద పడుతుంది. పాలకుల పరిపాలనా తీరుతెన్నుల ప్రభావం ప్రజలమీద వుంటుంది. కనుక పాలకులు, పెద్దలు, తల్లిదండ్రుల ప్రవర్తన బాగుండాలి. ఆదర్శమైనదిగా వుండాలి. వారు చేయు కర్మ ( పని ) శ్రేష్ఠమైనదిగా వుండాలి. జనకుడు ఆదర్శ ప్రభువు. నిష్కామ కర్మము చేతనే మోక్షమును బొందినాడు. ప్రహ్లాదుడు, అంబరీషుడు, భగీరథుడు మున్నగు చక్రవర్తులు కూడా జనకుని కోవకు చెందినవారే. కర్మమును నిష్కామ బుద్ధితో చేయుట వలన చిత్తము నిర్మలమగును. నిర్మల చిత్తమందు జ్ఞాన ముదయించును. జ్ఞాన విచారణచే మోక్షము సిద్ధించును.

మోక్షం పొందాలంటే కాకులు దూరని కారడవులలో ఘోరమైన తపస్సు చేయనవసరం లేదు. పాలకులు నిష్కామ కర్మతో పాలన చేస్తూ మోక్షము బడయవచ్చును. దీనికి ఉదాహరణ—జనక మహారాజు. ఎవరి వృత్తి వారు నిష్కామ బుద్ధితో చేస్తూ మోక్షమును పొందవచ్చును. దీనికి ఉదాహరణ—కటికి కసాయి వాడైన ధర్మవ్యాధుడు. లోకులను అపమార్గము నుండి తప్పించి సన్మార్గమున పెట్టవలెననిన పెద్దల ప్రవర్తన ఉన్నతంగా, ఆదర్శమైనదిగా వుండాలి. శ్రీమతి గాంధీ, శ్రీ మురార్జి, శ్రీ చరణ్ సింగ్, శ్రీ జగజీవన్ రాంల కుటుంబ సభ్యుల ప్రవర్తన మంచిగా లేకపోవడం వలననూ, అట్టివారికి మద్దతు యివ్వడం వలన వారు అప్రదిష్ఠపాలైనారు. ఆదే విధముగా లోగడ కూడా చాలామంది పాలకులు విమర్శలకు గురియయినారు. సహజంగా బాధ్యత గలవారు తప్పులు చేస్తే ప్రతి ఒక్కరి దృష్టినీ ఆకర్షిస్తారు. " అంతటివారే తప్పులు చేస్తే మనమేల చేయరాదు " అని లోకులు భావిస్తారు. కనుక బాధ్యత గల పెద్దలు, పాలకులు తమ ప్రవర్తన విషయంలో ప్రత్యేకంగా శ్రద్ధ వహించాలి.

' గీత ' లో భగవానుడు యిదే వాస్తవాన్ని ప్రబోధించాడు. పెద్దలు మహోన్నత ధర్మములను



## వాణి - శ్రీవాణి

వీణాపాణి విద్యారాణి వాణి
యువ సాహితీ కవుల
హృదయ వీణా తంత్రుల
మీటుతోంది శ్రీవాణి ;
వాణికి సరిజోడుగ
విద్యారాణికి సైదోడుగ
గీర్వాణికి పారాణిగ
మధురవాణిగ సాహితీ మహతిగ
సాహితీ-జగాన యుగ యుగాన
వెలుగొందాలి శ్రీవాణి.

— పి. వి. యస్. యస్. రాఘవరావు

 

## ఆమడ దూరం

ఈ సమాజంలో
కులం పేరుతో
బికారి అయినా
గౌరవనీయుడే
అంత్యజుడు
ఉన్నత పదవిని
అలంకరించినా
అతని స్థానం
ఆమడ దూరం !

— సవ్వప్పగారి ఈరన్న



ముమ్ముందు తానాచరించి లోకమునకు జూపుట ఆత్యావశ్యకమని భగవానుడు ఎప్పుడో బోధించినాడు. రానున్న తరాలను దృష్టిలో పెట్టుకొని ఈ హెచ్చరిక అర్జునునికి చేసినాడు. అంతటితో ఆగలేదు. తరువాత మూడు శ్లోకములలో కర్మయోగ ఆవశ్యకతను స్వకీయ దృష్టాంతము ద్వారా వివరించినాడు.

" ఓ అర్జునా ! నాకు ఈ మూడు లోకముల యందును చేయవలసిన పని ఏ కొంచమును లేదు. పొందబడనిదియు, పొందవలసినదియు ఏదియును లేదు, అయినప్పటికీ నేను ఎల్లప్పుడూ ఏమరుపాటు లేనివాడనై నా విద్యుక్త ధర్మమును నిర్వర్తించుచున్నాను. ఎందువలననగా ; నేనెల్లప్పుడు జాగరూకుడనై కర్మమందు ప్రవర్తించక పోయినచో, మనుష్యులు అన్ని విధములా నా యొక్క మార్గమునే అనుసరించి ప్రవర్తించుదురు. నేను మంచి పనులను చేయని యెడల ఈ ప్రజలు కూడా భ్రష్టులగుదురు. అన్ని రంగములందును గొప్ప సంకరము, అశాంతి ఏర్పడును. ప్రజలు అన్యాయమును. అధర్మమును ఆశ్రయించుదురు. తత్ఫలితముగ ఉపద్రవములు సంభవించును. ఇవ్విధముగ ప్రజల యొక్క వినాశమునకు నేను కారణభూతుడగుదును. కావున నా వరకు నా కవసరము లేకపోయినప్పటికీ ప్రజల సంక్షేమము కొఱకు నేను కర్మను చేయుచున్నాను. " అని కర్మయోగము యొక్క ఆవశ్యకతను గురించి శ్రీకృష్ణుడు భగవద్గీతలో చక్కగా, స్పష్టంగా వివరించాడు. కనుక ప్రతి ఒక్కరూ సత్ కర్మలను నిష్కామ బుద్ధితో ఫలాపేక్ష రహితంగా చేస్తూ లోక క్షేమం కొఱకు ఆదర్శవంతమైన జీవితాన్ని గడపాలని భగవద్గీత హెచ్చరిస్తున్నది. అందువలననే తిలక్, గాంధీజీలు రాజకీయాలలో తిరుగుతూ కూడా భగవద్గీతను విస్మరించి వుండలేదు. నేటి పాలకులలో చాలామంది భగవద్గీత తెరవనివారు వున్నారనటంలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు. ఇది నిజంగా వాస్తవం, దురదృష్టకరం. ●

# ఇందిరా కాంగ్రెసు శతాబ్ద్యుత్సవాలు !!

"ఇందిరా కాంగ్రెసు శతబ్ద్యుత్సవాలు" అంటే విచిత్రమనిపించవచ్చు. ఇందిరా గాంధీకే నూరేళ్ళు లేనప్పుడు ఆమె పెట్టిన పార్టీకి శతాబ్ది ఏమిటనిపించవచ్చు. అంత అలా అనిపించవలసిందేమీ లేదు. మన రాజకీయాలకు మరోపేరు విచిత్రాలు.

"కాంగ్రెసు శతాబ్ద్యుత్సవాలు" అనే పేరుతో పాలకవర్గం ఒక కార్యక్రమం తలపెట్టింది. దానిలోకి తమ పార్టీ కాని వారికి ప్రవేశం ఉండదని కాంగ్రెసు (ఐ) ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రీకాంతవర్మ ప్రకటించాడు. మిగిలినవారంతా ఈ ఉత్సవం తమదికాదులే అనుకున్నారు. అందువల్ల ఆ విషయమై దేశంలో ఎక్కడా చడి చప్పుడు లేదు–ఎ ఐ సి సి (ఐ) పందిట్లో సందడి తప్ప.

అదలా ఉండగా, ఈ సందడికి ముందు రెండురోజుల క్రితం హఠాత్తుగా నీలం సంజీవరెడ్డి, నిజలింగప్ప జగజీవన్‌రాం మరి ఇంకెవరెవరికో ఈ సందట్లో పాల్గొనవలసిందిగా కబురు పెళ్ళిందట. వారంతా ఒక విధంగా కాంగ్రెసు గోత్రీకులు. అందులో కొందరు అధ్యక్షస్థానాలుకూడా అలంకరించారు. చాలామంది "మేం రాము" అని తిరుగు కబురు పంపారుట. సంజీవరెడ్డి వగైరాలు "ఇది అసలైన కాంగ్రెసు కానేకాదు" అనికూడా వ్రాశారట.

## సంజీవరెడ్డికి కాసు సన్మానం

దానితో కాసు బ్రహ్మానందరెడ్డిగారు పందిట్లో చిందులు త్రొక్కుతూ– "వారి మాటలు పరమ అసహ్యంగా ఉన్నాయి. వారు అధిష్టించిన పదవులకే కళంకంగా ఉన్నాయి. వారికేదో మతిభ్రమణం కల్గింది. ఇందిరా కాంగ్రెసే అసలైన కాంగ్రెసని ఎన్నికల కమీషన్ కూడా సర్టిఫికేటు ఇచ్చింది"– అంటూ సన్మానపత్రాలు చదివారు. (ఇదే బ్రహ్మానందరెడ్డి ఇందిరాగాంధీకి చెల్లు చీటీకొట్టి, కొన్నాళ్ళు మరో కాంగ్రెసు వాణ్ణని, మళ్ళీ కొన్నాళ్ళు అజ్ఞాతంగా గడిపి, చివరకు ఎప్పుడో హఠాత్తుగా మళ్ళీ ఇందిరాగాంధీ పంచనజేరినట్లు గుర్తు). ఆహ్వానాలు అనబడేవి పంపబడిన ఇతరులు ఎవరెవరేమి వ్రాశారో వివరాలు వెల్లడికాలేదు. రాజీవ్‌గాంధీ ప్రధాన పాత్రధారిగా "కాంగ్రెసు శతాబ్ద్యుత్సవ ప్రారంభోత్సవ" సందడి జరిగిపోయింది.

## దేశవా

వేదికమీద జవహర్లాల్ నెహ్రూ, ఇందిరాగాంధీ చిత్రాలు, అందులో రాజీవ్‌గాంధీ చిత్రం. వానితోపాటు పాపం మహాత్మాగాంధీ చిత్రంకూడా అలంకరించారు. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర అంటే కాంగ్రెసు చరిత్రే నని, కాంగ్రెసు చరిత్ర అంటే నెహ్రూ కుటుంబత్యాగాల చరిత్రేనని రాజీవ్‌గాంధీ ఘనగంభీర ఉద్ఘాటన చేశారు. అసలు భూప్రపంచంలో నెహ్రూ కుటుంబానికి సాటివచ్చే త్యాగాలమారి కుటుంబమే లేదు అని కార్యాధ్యక్ష బిరుదాంకితుడు పండిత కమలాపతిత్రిపాఠి ఉద్ఘాటించారు. సభికులు హర్షధ్వానాలు చేశారు. దేశం ఆశ్చర్యపోయింది. పత్రికలు వ్రేలెత్తి చూపాయి.

మధ్యలో ఎన్. జి. రంగాకూడా ఏదో చెప్పారు ఆ సభలో. (ఈ రంగాగారు కాంగ్రెసుకు ఏనాడో చెల్లుచీటీ కొట్టి, కిసాన్ మజ్దూర్‌పార్టీ అని, స్వతంత్రపార్టీ అని, ఇంకేవేవో రకరకాల బల్లలుమార్చి, ఇప్పుడు తామే

వెనుకనుండి "కాంగ్రెసు" ను నడిపిస్తున్నామంటున్నారు. ఇంతకుముందు ఇందిరాగాంధీకి, ఇప్పుడు పిల్లవాడికి (రాజీవ్‌గాంధీకి) మార్గదర్శనం చేస్తున్నామంటున్నారు.) శతాబ్ద్యుత్సవ మహోత్సవవేళ స్వాతంత్ర్య సమరయోధు లకు నెలసరి పారితోషికం రు 300 ల నుండి రు 500 లకు ఇంక్రిమెంటు ప్రకటించి సంతృప్తి పరచారు.

## ఎన్ని కాంగ్రెసులో !

ఈమధ్య దేశంలో-కాంగ్రెసు (ఐ), కాంగ్రెసు (ఒ), జె, బి, ఆర్, యు, ఎస్ వగైరాలంటూ రకరకాల తోక లతో చాలా "కాంగ్రెస్"లు వెలిసాయి. కొన్ని ఉన్నాయి. కొన్ని పోయినాయి. ఈ గంద్రగోళంమధ్య ఏది అసలైన కాంగ్రెసు ? అసలైన కాంగ్రెసు అసలు ఉందా లేదా ? అది లేకపోతే ప్రస్తుత ఉత్సవం దేని తాలూకు? ఇత్యాది ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి. అసలు కథఅంతా తెలిసిన విషయజ్ఞులకోసం కాకపోయినా అది తెలియని అమాయక నవతరాలకోసం "కాంగ్రెస్ పేరు కథ" చెప్పుకోదగిన సందర్భం ఇది.

## కాంగ్రెసు పేరు కథ

1885లో హ్యూమ్ అనే ఒక తెల్లదొర "కాంగ్రెస్" అనే పేరుతో ఒక వేదిక పెట్టాడు. "కాంగ్రెస్" అంటే సభ, సమావేశం, సంస్థ ఇత్యాదిఅర్థాలు. ఆంగ్ల ప్రభుత్వం వారికి వినయపూర్వకంగా విజ్ఞాపనపత్రాలు సమర్పించుకోవ డం అప్పట్లో దాని పని అన్నారు కొందరు. 1857 స్వతంత్ర సంగ్రామాన్ని అణచివేసిన తర్వాత, మిగిలి ఉన్న స్వాతంత్ర్య భావతీవ్రతకు గాలి తీసివేసేందుకు పెట్టిన సేఫ్టీవాల్వు ఆ కాంగ్రెసు అన్నారు మరికొందరు. అదంతా ఏమయినా "హ్యూం కాంగ్రెసు" లక్ష్యం స్వరాజ్యం మాత్రంకాదని అందరూ అంగీకరిస్తారు.

## ఎందరో మహానుభావులు

అయితే అప్పట్లో దేశంలో దేశభక్తులకు త్యాగమూర్తు లకు కొదవ ఉండేదికాదు. స్వామి వివేకానందటోంట్లు ధర్మపరంగా దేశోద్ధరణను గురించి మాట్లాడేవారు. ఈ ఆర్జీల కాంగ్రెసు నచ్చని ఉడుకు రక్తంవారు కత్తులు పుచ్చుకొని తెల్లవారిని గెంటివేయడమే కర్తవ్యం అనే వారు. వారంతా క్రాంతికారులు. ఎవరో కవి అన్నట్లు-

కారాగారమె ప్రాసాదముగా
తుపాకి గుండ్లే పూలచెండ్లుగా
ఉరిచేరులనే ఉయ్యాలలుగా
తలంచి ధర్మోద్ధారణ కొరకై
దివికేగిన మన దేశభక్తులు....

అందులో ఎందరెందరో. వారంతా కాంగ్రెసు నామ ధారులు కాదు. కాని స్వతంత్ర సమరయోధులు, త్యాగ ధనులు. వాసుదేవ బల్వంత ఫాడ్కే, మదన్‌లాల్ డింగ్రా, స్వాతంత్ర్యవీర్ వినాయక దామోదరసావర్కార్, చంద్ర శేఖర ఆజాద్, భగత్‌సింగ్, బాటుకేశ్వరదత్ ఇలా ఎందరెందరో. అందులో ఫాడ్కే కాంగ్రెసు అనబడిన సంస్థ పుట్టకముందే భారతదేశం స్వతంత్ర రిపబ్లిక్ కావాలి అంటూ ప్రాణాలు అర్పించిన యోధుడు. (ఇక 1857 స్వతంత్ర సంగ్రామయోధులు, 1767 నాటి సన్యా సుల విప్లవ గాధలు అటుంచుదాం). "కాంగ్రెసు" కు ఈ స్వాతంత్ర్యయోధు లెవరితోను సంబంధంలేదు.

## "పునీత కాంగ్రెస్"

ఇతరత్రా ఉన్న దేశభక్తులు కొందరు ఈ "కాంగ్రెసు. వేదికను సమీపించారు. ఆర్జీల పద్ధతిని తప్పించడానికి ప్రయ త్నించారు. స్వరాజ్య లక్ష్యాన్ని ప్రవేశపెట్టారు. ప్రబలం అయినారు. ఉద్యమరూపం ధరించారు. "వందేమాతరం" అని నినాదం ఇచ్చారు. ఏదోగా ఆరంభమయిన కాంగ్రెసు మాతృదేశభక్తితో పునీతం కాజొచ్చింది. 1906 కలకత్తా కాంగ్రెసు మహాసభలో లోకమాన్య బాలగంగాధర తిలక్ "స్వరాజ్యం నా జన్మహక్కు" అని దిక్కులు పిక్క టిల్లేలా గర్జించాడు. ఆంగ్ల ప్రభుత్వం ఉలిక్కిపడింది దేశం ఉద్వేగం చెందింది. స్వదేశీ పరిశ్రమలు, విదేశీ వస్త్ర బహిష్కరణ, జాతీయవిద్య, స్వరాజ్య సాధన-

దేశంలో ఆశయాలుగా వ్యాపింపజొచ్చాయి. అది "లాల్, బాల్, పాల్" (లాలాలజపతిరాయి, బాలగంగాధర తిలక్, బిపించంద్రపాల్) యుగంగా చరిత్రకు ఎక్కింది. ఇంకెందరెందరో లెక్కకు మిక్కిలి మహనీయులు స్వాతంత్ర్య సాధనోద్యమానికి పుష్టి నివ్వజొచ్చారు. అదొక గొప్పయుగం. అప్పట్లో కాంగ్రెస్ స్వరాజ్య సాధనకు తెల్లవారి గెంటివేతకు ఒక ప్రతీక అయింది. వెలుపల విప్లవవీరులు, కాంగ్రెసులో స్వాతంత్ర్య పిపాసులు పరస్పర సానుభూతితో తమతమ కార్య కలాపాలు నడుపుకునేవారు. అరవిందఘోష్ వంట్లు దేశం, ధర్మం, విప్లవం, సాత్విక ప్రబోధం అన్నీ మేళ వించి జాతీయతకూ, దేశభక్తికి, విశ్వమానవ చింతనకూ నిర్వచనాలు చేశారు.

" భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులను లేగలు వగచుచుండ
తెల్లవారను గడసరి గొల్లవారు
పిదుకుచున్నారు మూతులు బిగియగట్టి "

అంటూ చిలకమర్తి వంట్లు కవితలు గానం చేశారు. బకించంద్రుని "ఆనందమఠం" వంటి నవలాగ్రంథాలు అన్ని భాషల్లో దేశానికి మేలుకొలుపులు పాడజొచ్చాయి....

## తిలక్ తర్వాత గాంధీజీ

తిలక్ మహాశయుడు వెళ్ళిపోయినారు. ఆ రోజుల్లోనే గాంధీజీ దక్షిణాఫ్రికానుండి తిరిగివచ్చారు. కాంగ్రెసు కార్య కలాపాలలో ప్రవేశించారు. దక్షిణాఫ్రికాలో ప్రయో గించిన సత్యాగ్రహ ఆయుధాన్ని భారత స్వాతంత్ర్య సంగ్రామానికి అన్వయించారు. సాత్విక నిరోధం, సత్యం, అహింసల ప్రాతిపదికను జోడించారు. తన రాజకీయ ఉద్యమానికి ఆధ్యాత్మిక స్వభావాన్ని మేళ వించారు. అప్పటికే స్వతంత్ర పిపాస చెలరేగి ఉన్న దేశం జేజేలు పలికింది. తిలక్‌ను లోకమాన్యుడుగా శ్లాఘిం చిన దేశం గాంధీజీని మహాత్ముడుగా శ్లాఘించింది. అప్ప టికే ప్రాతిపదికలు ఏర్పడిఉన్న స్వరాజ్య సందేశం గాంధీజీ హయాంలో గ్రామగ్రామానికి విస్తరించింది. ఆయన ప్రతిపాదించిన నిర్మాణకార్యక్రమం, హరిజన దేవాలయ ప్రవేశం, నైతిక సముద్ధరణ, మద్యపాన నిరోధం, గ్రామగ్రామాన జాతికి మాననీయములైనాయి. ఆయన కొల్లాయికట్టు, పిలకజుట్టు చాలామందికి అనుసర ణీయమైంది. ఆయనకు దక్షిణాఫ్రికా జైళ్ళలో పెట్టబడిన తెల్లటోపి, ఇక్కడ కాంగ్రెసువారికి సంకేతమయింది. ఆయన సత్య, అహింస, ఉదార, మతసహన ప్రబోధాలు జాతి స్వభావంలో ఇమిడిపోయినాయి. స్వరాజ్య సందేశం గ్రామగ్రామాన తిష్టవేసింది. కాంగ్రెసు జనసంస్థగా విచ్చ రిల్లింది. జైళ్ళు, లాఠీ దెబ్బలు తినడం, కష్టాలు పడడం, జాతికి మంచినీళ్ళ ప్రాయమైంది.

## నానారకాల ప్రవేశం

ఎల్లరిని ఆకట్టుకునే ఈ ఉదార ఘట్టంలోనే కాంగ్రె సులో నానారకాల శక్తులు ప్రవేశించాయి. కొత్త రాజకీ యాలు, చమత్కారాలు ప్రవేశించాయి. అందరిని ఆకట్టు కుని నిలుపుకునే ఉద్యమకారుడుగా గాంధీజీ అందరికీ ఆస్కారమిచ్చాడు. ఆహ్వానించారు. ఆదరించారు. రాజీలు పడ్డారు. ఎలాగైనా తెల్లవారిని అహింసా పద్ధతిలో పంపి వేయడం ఏకైక లక్ష్యంగా అందరిముందు ఉంచారు. ఈ ఆత్రతలో తిలక్, అరవిందఘోష్ ప్రభృతులు ఏర్పరిచిన తాత్విక ప్రాతిపదికలు సడలజొచ్చాయి.

ముస్లింలను కూడగట్టుకునేందుకు ఖిలాఫత్ ఉద్య మాన్ని చేపట్టారు. టర్కీలో ఖలీఫా రాజ్యానికి ఆంగ్లే యులు వ్యతిరేకం గనుక, ఖలీఫా రాజ్యాన్ని కాంగ్రెసు సమర్ధిస్తే తాము కాంగ్రెసును సమర్థిస్తామని భారతదేశపు ముస్లింల షరతు. ఇందులో ప్రధానాంశం బేషరతుగా స్వరాజ్య సాధన లక్ష్యంకాదు. ఈ వైఖరి గాంధీజీ ఆదరం పొందింది.

మరోప్రక్క ఆఫ్ఘనిస్థాన్ మార్గాన భారత జైళ్ళకు రష్యానుండి కమ్యూనిస్టు పుస్తకాలు ప్రవేశించజొచ్చాయి.

ఇదేదో కొత్త గమ్మత్తు విప్లవం అనుకుంటూ కొందరు మెత్తబడజొచ్చారు.

1927లో జవహర్లాల్ నెహ్రూ రష్యాలో విప్లవాల దశవార్షికోత్సవాలు చూసివచ్చి "మార్క్సిజం నా హృదయపు చీకట్లను పారద్రోలింది" అంటూ దిగారు. అటు అమెరికానుండి జయప్రకాశ్‌నారాయణ మార్క్సుపుస్తకాలు చదివి సోషలిజం ప్రతిపాదనలతో తిరిగివచ్చారు. ఇలా కాంగ్రెసులో రకరకాల లాబీలు ఏర్పడజొచ్చాయి. అందరూ తెల్లవారిని పంపివేయడం వరకు అంగీకరిస్తారు గనుక గాంధీజీ అందరికీ ఆశ్రయమయినారు. రాజేంద్ర ప్రసాద్, సర్దార్ వల్లభాయి పటేల్, జయప్రకాశ్ ప్రభృతి అసందిగ్ధ జాతీయవాదులతోపాటు అన్యులూ కాంగ్రెసులో సాగుతున్నారు.

## నెహ్రూ ప్రసక్తి

వీరిమధ్య జవహర్లాల్ నెహ్రూకూడా ఉన్నారు. అంతకుముందు వారి తండ్రిగారు మోతీలాల్ నెహ్రూగారు ప్రవేశించే ఉన్నారు. సంపన్నులు, విదేశాలుచూచిన విద్యావంతులు, రాజకీయ చాకచక్యాలున్నవారు. ఆంగ్ల నాగరికతలో భాగస్వాములుగా ఆంగ్లేయులకు సన్నిహితులు. అందగాళ్ళు, ఉత్సాహవంతులు యువకులకు సరదాగా ఉంటారు. వారిదొక చారిస్మా జనాకర్షణ. అందువల్ల కార్యవాది అయిన గాంధీజీ వారినీ ఆదరించారు. వారు పరస్పర, ప్రచార, సహకారాలతో, తమ ఆంతరికభావాలు ఏమయినా కాంగ్రెసును, ప్రజాదరణ పొందిన గాంధీజీ ప్రాపునుమాత్రం వదలలేదు. మోతీలాల్ నెహ్రూ చేతుల నుండి కాంగ్రెసు అధ్యక్షత జవర్లాల్ నెహ్రూకు అందింది. గాంధీజీకి జవహర్లాల్ నెహ్రూకు అసలు జీవన దృక్పధంలోనే సామ్యంలేదు. ఆముక్క జవహర్లాల్ నెహ్రూయే చెప్పుకున్నారు. ఉద్యమంవరకు గాంధీజీతో సహచరుడు. సాహచర్యంవల్ల పరస్పర ప్రేమాభిమానాలు ఉన్నాయి. తాత్వికంగా జవహర్లాల్ నెహ్రూకు గాంధీజీకన్న కమ్యూనిస్టులు సన్నిహితులు. సోషలిస్టులుకూడా కొంత సన్నిహితులే. అయినా జవహర్లాల్ నెహ్రూ వారందరినిగాక, ప్రజల హృదయాలు చూరగొన్న గాంధీజీనే అంటిపెట్టుకొని ఉన్నారు. ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా కాంగ్రెసు పేరును మాత్రం వదలలేదు.

జయప్రకాశ్ ప్రభృతి జాతీయ ప్రజాస్వామిక సోషలిస్టులు కాంగ్రెసుకు, స్వరాజ్య సాధనకు అంకితమై సోషలిస్టు వేదికను నిర్వహించేవారు. నెహ్రూ మాత్రం అందులోకూడా చేరలేదు. గాంధీజీ వెంట ఉంటూ వాళ్ళకు పైపైన సానుభూతి ఇస్తూండేవారు. కాంగ్రెసు మహాసంస్థగాని, మహాత్మాగాంధీగాని ఏనాడూ కమ్యూనిజాన్నిగాని మార్క్సిజాన్నిగాని, నెహ్రూ ఇజాన్నిగాని ఏనాడూ స్వీకరించలేదు. అసలు స్వరాజ్యం వచ్చిన సమయంల్లో దేశంలో ప్రాంతీయ కాంగ్రెసు పార్టీలన్నీ సర్దార్ వల్లభాయి పటేల్‌ను ప్రధానమంత్రి స్థానానికి ఎంపిక చేసుకున్నాయి. నెహ్రూజీ అంటే వ్యక్తిగతంగా కాంగ్రెసులోని మహనీయులకు ప్రేమ, ఆదరాలు లేకకాదు. ఉపన్యాసాలు తీర్మానాలు రాయడంలో ఆయన ప్రతిభలపై ఆసక్తి లేకకాదు. ఆయన జీవన దృక్పధం, సిద్ధాంత తత్వాలపై విశ్వాసం, ఆమోదం లేక. అయితే మౌంట్ బాటన్ ప్రమేయ చమత్కారాలతో పటేల్ బదులు జవహర్లాల్ నెహ్రూ భారత ప్రధాని అయినారు. కాంగ్రెసులోని అగ్రశ్రేణి నాయకులందరూ వెళ్ళిపోయిన తర్వాత 1950వ దశకంలో మాత్రమే జవహర్లాల్ నెహ్రూ అవడి "కాంగ్రెసు" సభల్లో తన "సోషలిస్టు సరళి" పధకానికి "కాంగ్రెసు" అనబడే దానితో ఆమోదముద్ర వేయించుకున్నది. అంతేగాని ఇవాళ రాజీవ్‌గాంధీ చెప్తున్నట్లు-నెహ్రూ అడుగుజాడల్లో సోషలిజం వగైరా సిద్ధాంతాలతో కాంగ్రెసు నడుస్తూ వచ్చిందనేది –

చరిత్రకాదు. నెహ్రూ వంశం తీసుకుంటూ వచ్చిన మరొక విశేషం, కాంగ్రెసుతోపాటు ఉద్యమం, జైళ్ళు, త్యాగం అంటూనే తమ కుటుంబ ప్రయోజనాలు, నాయకత్వ పరంపర ప్రయోజనాలు భద్రంగా చూచుకుంటూ, ఎప్పటి కప్పుడు ముందు ఏర్పాట్లు చేసుకుంటూ గడపడం. ప్రపంచం మొత్తంమీద నెహ్రూ కుటుంబం చేసినన్ని త్యాగాలు మరే కుటుంబమూ చేయలేదని కమలాపతిత్రిపాఠీ అన్నారుగాని, నాయకత్వ భోగం అనుభవించడం విష యంలో ఆ కుటుంబానికి సాటిలేదు అని అంగీకరించవచ్చు. అందుకు తార్కాణం ఎన్నడూ దేశం విషయం పట్టించు కోని రాజీవ్‌గాంధీ నేడు స్వరాజ్యస్వము అన్నట్లు పరిగ ణింపబడడం. ఇది యాదృచ్ఛికం కాదు. అది ఆ కుటుంబం అవలంబించిన నిరంతర యోజనాబద్ధ కృషి ఫలితం అనాలి.

## లాబీలకూటమి కాంగ్రెసు

మొత్తంమీద అందరిని కూడగట్టుకొని ఉద్యమాన్ని నడిపేందుకు మహాత్మాగాంధీ అవలంబించిన విధానంక్రింద అనేకరకాల లాబీలు బలపడ్డాయి. వాటిని గాంధీజీగాని, "కాంగ్రెసు" గాని అదుపుజేయలేక పోయినారు. 1942లో మహాత్మాగాంధీ క్విట్ ఇండియా ఉద్యమానికి పిలుపు నిచ్చారు. అప్పట్లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం జరుగు తోంది. ఆంగ్లేయులు, రష్యావారు అంతా ఒక్కటై జర్మనీ (హిట్లర్)ను ఎదిరిస్తున్నారు. గాంధీజీ స్వరాజ్య ఉద్యమాన్ని ఈ ప్రపంచ రాజకీయాలలోకి దించక "ముందు ఆంగ్లేయులు వెళ్ళిపోవాలి" అని ఇచ్చిన పిలుపు అది. నేతాజీ సుభాష్‌చంద్రబోసు మరొక అడుగుముందుకు వెళ్ళి అదే జర్మనీ, జపాన్‌లను ఉపయో గించి ఆంగ్లేయులపై దాడిచేసి భారతదేశానికి స్వరాజ్యం స్థాపించాలని విదేశాల్లో ఆజాద్ హిందుఫౌజు స్థాపించి, ఆంగ్లేయులపై యుద్ధంచేసి, తూర్పుదీవుల్లో అండ మాన్స్‌లో భారతపతాకను ఎగురవేశారు. దేశంలోని జాతీయ సోషలిస్టులు గాంధీజీ పిలుపుకు అండగా దేశ మంతా (గాంధీజీ అహింసా ఉద్యమానికి విభిన్నమయినా) విప్లవోద్యమంవంటిది సాగించారు. అలా అన్నివైపుల దేశభక్తి ఉప్పొంగిన సమయంలో కాంగ్రెసుతోఉన్న కమ్యూనిష్టు లాబీ, ఆంగ్లేయులు అప్పట్లో రష్యాకు మిత్రము గనుక, తమకూ ఆంగ్లేయులు మిత్రమేనంటూ, ఆ యుద్ధం ప్రజాయుద్ధమని, అందువల్ల యుద్ధంలో ఆంగ్లేయులకు ( అంటే రష్యాకు ) సాయపడాలని చెప్పి క్విట్ ఇండియా ఉద్యమాన్ని భగ్నంచేసి, దేశభక్తులను పోలీసులకు పట్టించజూచారు. ఆ తర్వాత కమ్యూనిష్టు లను కాంగ్రెసు గెంటివేసింది. ఆ దశలో నెహ్రూ లాబీ అవలంబించిన వైఖరి, నేతాజీపట్ల అవలంబించిన వైఖరి అధ్యయనార్హం. ఈనాడు నెహ్రూ వర్గం అలనాటి కథను "ఫాసిస్టు పరాజయ 40వ వార్షికోత్సవ" కోలా హలంలో కమ్యూనిస్టులతో కలిసి స్మరించుకోవడం, భారత స్వాతంత్ర్యోద్యమంలో అలనాడు కమ్యూనిస్టుల పాత్రను విస్మరింపజేయబూనడం, ఇత్యాదులన్ని గమనార్హం.

( సశేషం )

" విద్యయొక్క పరమార్థం స్వతంత్రంగా ఆలోచించుట, స్వతంత్రంగా జీవించుట "

- లాలాలజపతిరాయి

ఇది తేలిగ్గా అర్థంచేసుకోలేని ఒక మహనీయునికి సంబంధించిన అపరిచితకథ. ఆయన గడిపిన జీవితంలోని సామాన్య విలువలు పరస్పర విరుద్ధంగా కనపడతాయి. "నేనే దేవుణ్ని" అంటాడాయన. తాను మాట్లాడకూడదనీ, వ్రాయకూడదని కోరుకున్నాడు. ఆఖరికి తనను గురించి ప్రచారం చేయించుకొనేందుకు అనుచరుల్ని కూడ, చేరదీయలేదు. మన అదృష్టంకొద్దీ సనాతనుడైన భగవంతుడు మానవాళి నుద్ధరించుటకు, రక్షకుడై మెహెర్‌బాబాగా అవతరించాడు. ఆయనే దైవీ మానవుడు.

తోనో సద్గురువు కాలేదు. 19 ఏళ్ళ చిరుప్రాయంలో, యింకా కాలేజీలో చదువుతుండగా, స్పష్టమైన అవ్యవస్థ ప్రారంభమైంది. మనస్సు చెడిందని తలిదండ్రులనుకున్నారు. కానీ ఆయన మాత్రం జ్ఞానాన్ని కోల్పోలేదు. పంచ సద్గురువుల సమాగమ ప్రాప్తితో, అత్యున్నత భూమికచేరి, అనంతానందాన్ని అనుభవించటంతోపాటు, తన నిజస్థితిని తెలుసుకోగలిగాడు. యీ మాయ కతీతుడనని, అప్పటివరకు, తనను గురించి వూహించుకున్నదంతా అసత్యమని గుర్తించకలిగాడు. దీనినే ఆత్మ సాక్షాత్కారమంటారు.



# అఖండ మౌనంతో సకల జగత్తుకూ ఆధ్యాత్మిక విమోచనం కలిగించిన యుగపురుషుడు

# అవతార్ మెహెర్ బాబా



## దైవీ మానవుడు

నిస్సహాయులైన మానవాళి అచేతనంగా రక్షణకొరకు విలపిస్తుంటే, ఆర్తత్రాణ పరాయణుడైన భగవంతుడు మానవరూపధారియై అవతరించి, కంపిస్తున్న నాగరికతను, నలిగిపోతున్న మతాన్ని రక్షించవలసిన అవుసరం ఏర్పడింది. ఈనాటి నవనాగరిక మానవాళిలో జాతి, మత, కుల, స్త్రీ పురుష వివక్షత లేకుండా, సర్వమానవ సౌభ్రాతృత్వం, సోదరభావం, సమానత్వం పెంపొందచేయుటకు, శక్తివంతమైన అవతారుని రాక అవసరమైంది.

ఆత్మజ్ఞానం పెంపొంది, ప్రకృతిపై ఆధిపత్యం సాధించి సత్యంతో సమైక్యమైన వారిని, దైవీమానవుడు అంటారు. ఆయన మేల్కొలిపేవానిగా దైవంనుండి వచ్చిన వాడన్నమాట. మెహెర్‌బాబా తెలివితేటలు పెంచుకునో, వున్నతవిద్య నభ్యసించో, లేక సహజ ప్రవృత్తి

## యుగధర్మం

మనమున్నది అణుయుగం. యీ కలియుగాన్ని బాబా యినుప యుగమన్నారు. ఇది రాకెట్‌యుగం. స్ఫుత్నిక్ యుగం. నాగరికత పెరిగిన కొద్దీ సైన్సుకూడ అభివృద్ధి చెందుతోంది. వ్యక్తిగత స్వార్థం ప్రపంచవ్యాప్తంగా ప్రబలింది. అశాంతి, అస్తవ్యస్త పరిస్థితులు అంతర్జాతీయంగా యుద్ధవాతావరణాన్ని సృష్టిస్తున్నాయి. ఆధ్యాత్మిక వాతావరణానికి సంకటకాలం దాపురించింది. గ్రహాంతర యానంచేసి చంద్రమండలంలో కాలూనారు మన గగన వీరులు.

గ్రహాంతరాళ పరిశోధనలో శాస్త్రవిజ్ఞానం అభివృద్ధి చెందింది. చేతిబాంబునుండి, హైడ్రోజనుబాంబు వరకు మారణాయుధాలు రోజు రోజుకు పెరిగిపోతున్నాయి. యివన్నీ మానవునిలోని అహంభావానికితోడై మానవ

మేరకు ప్రశాంతత కొరవడింది. అణుస్ఫోటిక మారణ హోమం ప్రపంచాన్ని గజగజ లాడిస్తోంది. మనోవేదన పెరిగి సుఖశాంతులు అదృశ్యమైనయి.

ఈ విషాదాంతానికి విరుగుడు అనంత చైతన్యంగల భగవంతు డొక్కడే. యాంత్రికయుగంలో జీవిస్తున్న మనకు, వాతావరణ కాలుష్యం, ధ్వని కాలుష్యం, జల కాలుష్యం, మున్నగునవి ప్రశాంతతను నశింపజేస్తున్నయి. శబ్ద కాలుష్యం విలయతాండవం చేస్తున్నా, ఆ శబ్దానికి కారణభూతమైన యంత్రాల్ని నడిపే, విద్యుత్తు మాత్రం ఏధ్వని చేయటంలేదు. అంతువట్టని మౌనంనుండి, యీ ప్రపంచంలో సూర్యుడు మౌనంతో ప్రకాశిస్తున్నట్లు, మౌనంలోనే మొక్కల్ని వృక్షాల్ని ఫలరసభరితంగా భూమాత చేస్తున్నట్లే, అణుశక్తి మౌనంగా అవతరించి, అణుయుగాన్ని అధునాతనం చేస్తున్నది.

అలాగే బ్రహ్మజ్ఞానం పొందేందుకు మౌనం ఒక్కటే సరియైనభాష. ఆధ్యాత్మిక శిక్షణలో మౌనాన్ని సాధన చేయటం, అన్ని యుగాల్లోనూ ఆచారంగా వస్తోంది. ఈనాటి విపత్కర పరిస్థితుల్లో మానవమేధస్సును సక్రమ రీతిలో నడిపేందుకు అద్వితీయ మార్గదర్శకుని అవుసరం వచ్చింది.

## ప్రేమవాణి

ఈ యాంత్రికయుగంలో సైతం, మహాజ్ఞానుల ముఖతః, మౌనం వుద్భవించింది. వారు గళం విప్పకున్నా. వారిమాటలు తమ అంతర్గతవాణియొక్క రవ్వలు. ఆధ్యాత్మికంగా మౌనం శక్తిని పరిరక్షిస్తుంది. అంతర్గత శాంతిని కాపాడుతుంది. మాటల్లో అందించే బోధల్ని యీ వ్రపంచం యిప్పటికే విన్నది. బుద్ధుడు ధర్మమార్గాన్ని గురించి చెప్పి, భూతదయను, సదాచార నియమాల్ని నిలిపాడు. అలాగే జీసస్ క్రీస్తు, శాంతి దూతగా ఓర్పుని, త్యాగాన్ని జగత్తుకు చూపించాడు. అహింస కోసరం గాంధీజీ జీవించారు. మహనీయులు, కాలానుగుణ్యమైన జీవితం గడిపి, తమ సందేశాల్ని మిగిల్చి, గతించిపోతారు.

ప్రతి ప్రవక్త మానవాళిని ఐక్యపరిచేందుకే ప్రయత్నించారు. కానీ వారి అనుయాయులు మాత్రం, సంకుచిత భావాల్తో, మతాతత్వాల్ని ప్రేరేపించి మానవఐక్యతను విచ్ఛిన్నం పరిచారు. అంటే బోధలు, సందేశాలు, పెడచెవిని పెట్టబడినయి. మానవుడు గ్రహించే శక్తిని కోల్పోయాడు. సున్నితమైన ప్రేమవాణి, రణగొణ ధ్వనుల్లో కలిసిపోయింది. తికమకపెట్టే మతమౌఢ్యపు కారుచీకట్లో తన గమ్యం చేరే మార్గం తెలుసుకోలేక పోతున్నాడు. ఇట్టి తరుణంలో మెహెర్‌బాబా మౌనావతారుడుగా అవతరించాడు.

.........................

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

## ధర్మోపదేశాలు

ధర్మోపదేశాల వలన గాఢాంధకారం తొలిగిపోదు. మానశికంగా ప్రబలివున్న మతోన్మాదం, పోరాటతత్వం, సమశిపోయేట్లు చేసేందుకు, శాంతికాముకమైన, స్వయం శక్తిగల దివ్య ఆత్మయొక్క అవుసరమెంతైనా వుంది. ఈనాడు కావలసింది ధార్మిక సాంప్రదాయాలు కాదు. ప్రేమ కావాలి. దివ్య ప్రేమ యీర్ష్య, ద్వేషాల్ని జయిస్తుంది. ఇటువంటి జీవితం గడపటమంటే, విధేయత, నిస్వార్ధసేవ, వినయము, నిష్కపటము అనేవి కలిగి జీవించటం. ఇట్టి జీవితం గడిపే ప్రేమికుల యెడల మెహెర్‌బాబా ప్రేమ ఎల్లప్పుడూ, వెంటవుండి సహాయ పడుతూ మార్గదర్శకంగా వుంటుంది.

దివ్యప్రేమలో కోరికలు ఆశలు సంస్కారాలు సమస్తం దగ్ధమైపోతయి. ఆధ్యాత్మిక మార్గంలో సిద్ధాంతాలకంటే, ఆచరణయోగ్యమైన జీవితవిధానానికే ఎక్కువ ప్రాధాన్యత వుంది. కర్మకాండలు, నియమనిష్ఠలు మున్నగు మూఢాచారాల వలన వ్యక్తిగత నష్టాలతోపాటు సాంఘిక కల్లోలాలుకూడ సంభవిస్తాయి. అందుకే మెహెర్‌బాబా మతాచారాలు, పూజాపునస్కారాలు, ఆధ్యాత్మిక పురోగతికి అవరోధాలవుతాయన్నారు.

## మౌనజ్యోతి

యుగయుగాలుగాపున్న అజ్ఞానాంధకారాన్ని తొలగించేందుకు, ఒక్క మౌనజ్యోతికే శక్తి వుంది. ఆ జ్యోతే మెహెర్‌బాబా అద్భుత మౌనావతారం. బిగ్గరగా విజిలు పూదినంత మాత్రంచేత, రైలుఇంజను కదలదు. రైలు కదలాలంటే ఆవిరిశక్తి వదలాలి. అలాగే మానవమనస్సు, హృదయపు శక్తుల్ని నడిపే డ్రైవరుగా, భగవంతుడు మెహెరావతారుడై వచ్చాడు. పరిమితమైన మానవ చైతన్యాన్ని పరిశుద్ధపరిచి గమ్యం చేర్చేందుకు ఆయన మౌనాన్ని ఎంచుకున్నారు.

కులాలు, మతాలు, మూఢాచారాలతో సతమతమవుతున్న మానవాళిలో సనాతన ఆత్మచైతన్యాన్ని మేల్కొల్పేందుకు, అనంత జ్ఞానమనే జ్యోతిని పట్టుకున్న సనాతనుడాయన. పేద ధనిక భేదంలేక నిరుపేదలకు, కుష్టురోగులకు సైతం, పాదాలు కడిగి వంగి ప్రణమిల్లేవారు. అందరికీ షడ్రసోపేతంగా మృష్టాన్న భోజనం వడ్డించి తాను మాత్రం కొద్దిగా పప్పు అన్నం తినేవారు. అందరినీ ఆలింగనం చేసుకొని, అందరిలోను తననే చూచేవారు.

యినుప యుగమైన ప్రస్తుత యాంత్రికయుగంలో శాస్త్ర విజ్ఞానం అపారంగా సాధించినా, మాత మౌఢ్యపు కోరల్లో బందీలైన మానవాళిని వుద్ధరించేందుకు, బోధలతో వుపయోగంలేదని మెహెర్‌బాబా మౌనాన్ని ఎంచుకున్నారు.

## మహిమాన్విత నిశ్శబ్దం

చరిత్రపుటలు తిరగవేస్తే మౌనం పాటించటం యుగయుగాల నుండి పరిపాటిగ వస్తున్నట్లు బోధపడుతుంది. "తనను తాను తెలుసుకోగలిగినవాడు మాట్లాడడు" అని లావోట్జ్ అన్నాడు. బుద్ధుడు శిష్యుని విధేయతను గురించి చెప్పమన్నప్పుడు, తీక్షణదృష్టితో మౌనంగా చూచాడు. జీసను జీవితం 32 ఏళ్ళు మౌనంగానే గడిచిపోయింది. సత్యముయొక్క స్వభావం గురించి పిలెట్ ప్రశ్నించినప్పుడు, ఆయన మౌనంగా వుండిపోయాడు. ప్లోటెనసు జీవితాంతము మౌనం పాటించి తన అనుయాయులను మౌనంతోనే తనను అర్థం చేసుకోమన్నాడు. పాశ్చాత్య దేశాల్లో మౌనం పాటించినవారి సంఖ్య ఎక్కువే.

మెహెర్‌బాబా పాటించిన మౌనం ఆధ్యాత్మిక పురోగతి సాధించేందుకు, చేసే సాధన క్రిందకు రాదు. అది ఆయనచేసే కార్యవిధానానికి సంబంధించినది. "నా మౌనమే మాట్లాడలేనప్పుడు, నోటిమాటలతో చెప్పే వుపన్యాసాల వలన వుపయోగమేమిటని" బాబా అనేవారు.

## మౌన విశిష్టత

ఎప్పుడూ భగవంతుడు మౌనంతోనే పనిచేస్తున్నాడు. మామూలుగా మౌనం క్రమశిక్షణను సూచిస్తుంది. స్వయంస్మృతి కలిగి వుండేందుకు వుపయోగపడవచ్చును. శిష్యుల ప్రశ్నలకు గురువు జవాబు మౌనం. మరి మెహెర్‌బాబా మౌనం పాటించారంటే, తప్పనిసరిగా వివరించలేని కారణమేదో వుండితీరాలి. తాను మహిమాన్విత మౌనాన్ని పాటిస్తున్నా "నేను మౌనంగా లేను, సౌంజ్ఞల ద్వారా అక్షర ఫలకం ద్వారా ధారావాహికంగా మాట్లాడుతూనే వున్నాను" అని బాబా అన్నారు.

ఆయన సమక్షంలో మెసిలేవారికి మౌనంతో సంభాషిస్తున్నట్లే అనుభూతి కలిగేది. ఆయన సౌంజ్ఞలు మాటలకు అతీతమైనవి. మాటలతో వాటికి పనిలేదు. బాహ్యంగా వినపడకుండా, హృదయం నుండి హృదయానికి వినపడే నిశ్శబ్దమది. ఒక్కొక్కప్పుడు ఆయన యితరులతో ముచ్చటించేప్పుడు, వారు భిన్న భాషల వారైనప్పటికీ వారికి రాని భాషను, తన సౌంజ్ఞలలో వుపయోగిస్తున్నట్లు గుర్తుచేసేవారు. అంటే వారికాభాష రానప్పటికీ ఆయన సౌంజ్ఞల్లో ఇచ్చే సందేశాల్ని వారు అర్థం చేసుకోగలిగేవారన్నమాట.

మౌనమంటే కేవలం మాట్లాడకుండా వుండటమే కాదు. కోరికలకు, ఆవేశకావేశాలకు, ప్రేమానురాగాలకు సంబంధించి మనస్సు హృదయముల మధ్య జరిగే సంఘర్షణలో కూడ మౌనం వహించకలిగినప్పుడే అది మౌనం అవుతుంది. బాబా పాటించిన మౌనం మాటలతో చెప్పలేని, రాతలలో వ్రాయలేని వాటిమధ్య వుండేట్లుచేసింది.

ఆయన గడిపిన మౌనజీవితం, తానీ భౌతిక ప్రపంచానికి సంబంధించినవాడు కాడని అంతర్దృష్టికి, అంతర్జ్ఞానానికి సంబంధించిన వారని రుజువుపరచింది. ఆయన మౌనంతో యిచ్చిన సందేశాల్ని, ప్రవచనాల్ని చదివి నప్పుడు వారి మౌనాన్ని మనమెన్నడూ మరువలేం. మౌనం ఆయన ముఖ్య లక్షణాల్లో ఒకటి.

ఆయన అందించిన ఎన్నో విషయాలు, అచ్చువేయ బడివున్నా కూడ వాటినిగురించి ఆయన ఒక్కమాట పలక లేదు. కృష్ణుడు వ్రాసిన రాతలులేవు. ఎక్కువగా మాట్లాడిన బుద్ధుడు ఏమీ వ్రాయలేదు. జీసస్‌క్రీస్తు వ్రాసిందేదీ లేదు. సోక్రటీసు అధికంగా మాట్లాడినా వ్రాసింది లేదు. అలాగే బాబా విశిష్టత అంతా ఆయన రాతలద్వారా కాక, మౌనంతోనే ప్రకటితమైంది.

## అవతార మంత్రాంగం

మెహెర్‌బాబా మౌనం ఒక విశిష్టమైన అత్యద్భుత మౌనం. చాలాసార్లు తాను మౌనవిరమణ చేయబోతు న్నట్లు ప్రకటించారు. మౌనం ప్రారంభించిన రెండేళ్ళకే అయిదురోజుల్లో మాట్లాడబోతున్నట్లు ప్రకటించారు. కానీ మాట్లాడలేదు. 1932 లోను, 1941 లోను మాట్లాడ బోతున్నట్లు చెప్పారే కానీ మాట్లాడలేదు.

పదమనేది అంతర్గతంగా వుండేది. వినకలిగేవారికి, అంతర్ చెవితోనే వినబడుతుంది. వ్యక్తిగతంగా ఎవరికి వారు తమలోవుండే గ్రహించగల శక్తినిబట్టి మాత్రమే వినగలరు. తాను మాట్లాడటం తన స్పష్టీకరణ రెండూ ఒక్కటేనని మరో పర్యాయం అన్నారు. దాని విరమణపై ఓడిమిడి జ్ఞానంతో ఎవరైనా వ్యాఖ్యానించ పూనుకుంటే అది ఆయన కార్యవిధానంపై వారికి సరియగు అవగాహన లేనందువలననే.

మన పురాణాలు తదితర మతగ్రంథాలుకూడ యీ సృష్టంతా తమ గమ్యం చేరేందుకు సద్గురువు సహాయ పడతాడని చెపుతున్నాయి. అలా చేయటానికి మాటలతో పనిలేదు. పైపెచ్చు మాటలు అవరోధాలవుతాయి. అనంతమౌనాన్ని తెలుసుకోగల ఏ కొద్దిమందోతప్ప ఎవరూ గ్రహించలేని మౌనాన్నిపాటిస్తూ, ఆదైవమే, మానవరూపంలో మెహెర్‌బాబాగా పనిచేశాడు. భగవంతుడు అనంతమౌనం కనుక మెహెర్‌బాబా తన అవతార మంత్రాంగాన్ని మౌనంతో ప్రారంభించి మౌనంతోనే పూర్తి చేశారు.

తానందివ్వదలచిన దానిని మాటల ద్వారాకాక, పూర్ణ సమర్పణయొక్క మౌనంద్వారా నిశ్శబ్దప్రేమను మన హృదయాంతరాళాలలోనికి ప్రవహించేలా చేశారు. "మారణాయుధాలతో మారణహోమం జరుగుతున్న యీ ఆధునికయుగంలో, మాటలు విపరీతంగా పెరిగి వాటికి అర్థమేలేకుండా పోయింది. మునపటి నా సందేశాలన్నీ నిర్లక్ష్యం చేయబడి విపరీతార్థాలు కల్పించబడినవి. అందుకే నేను మౌనం వహించాను" అనిచెప్పి, మాటలతో పని లేని మంత్రాంగం నెరిపారు.

జీవితంలో నిరంతరం ప్రయాసపడుతూ అపజయంపాలై నిరాశ, నిస్పృహ, సంకోచాలతో సతమతమవుతున్న మాన వాళికి బాబా యిచ్చిన సందేశం "విశ్వాసంవుంచండి. దైవా నికి సర్వార్పణ గావించుకొని, దివ్యప్రేమను పొందండి. కుశంకలతో నా మౌనం గురించి చర్చించకండి. నాలోతులు మీరు కొలవలేరు. నన్నర్థం చేసుకొనుటకు ప్రయ త్నించండి."

## జూలై 10 ప్రాముఖ్యత

బాబా ప్రేమికలోకానికి జూలై 10 బ్రహ్మాండమైన విశిష్టత సంతరించుకున్నరోజు. జీవితంలో అత్యంత విలు వైన ఆధ్యాత్మికసారాన్ని రంగరించి, అన్వేషకుల కందించుటకు 1925 జూలై 10వ తేదీన మెహెర్‌బాబా అఖండమౌనాన్ని ప్రారంభించి, 1969 జనవరి 31న తన అవతార కాలపరిమితి సమాప్తమయ్యేంతవరకు, నిరాఘా టంగా సాగించారు.

"నేను మేల్కొలుపుటకే కానీ బోధించుటకు రాలేదు" అంటూ, గత అవతారులవలెకాక తన అఖండమౌనంతో సకల జగత్తుకూ ఆధ్యాత్మిక విమోచనం కలిగించారు. యీ యుగావతారుడైన మెహెర్‌బాబా సకలసృష్టికి తండ్రి. మనకు తెలిసినా, తెలియకపోయినా అందరి హృదయాల్లో నివసించే సర్వవ్యాపకుడైన ఆ ప్రభువు మౌనం పాటించి నట్లు కనబడినా, మన గమ్యాన్ని చేర్చేందుకు తన మౌనాన్ని వినియోగించారనటంలో సందేహంలేదు.

జై బాబా!

( 4వ పేజీ తరువాయి )

సిద్ధాసనమునే రక రకములుగా వివిధ వీళ్ళతో అభ్యసింపవచ్చును.

**కుడికాలి** యొక్కయు, ఎడమ కాలి యొక్కయు మడమలను రెండింటిని క్రింది మీదుగా చేర్చి యోని స్థాన మందుంచుటను ముక్తాసనము అందురు.

కుడి కాలి, ఎడమ కాలి మడమలను జననేంద్రియ స్థానమునకు క్రిందు మీదుగా వుంచిన యెడల గుప్తాసనము, జననేంద్రియ స్థానమును దాచివుంచి నట్లగును కాన దీనిని గుప్త ఆసనము అందురు.

సిద్ధాసనమునే స్థిరాసనమని, బుద్ధాసనమని కూడ అంటారు. స్థిరంగా కూర్చొన గలిగే ఆసనము గాన స్థిరాసనము, బుద్ధ భగవానుడు అభ్యసించిన ఆసనము కాబట్టి బుద్ధాసనము అంటారు.

పద్మాసనములోని ఉపయోగములన్నీ సిద్ధాసనములో కూడ లభ్యం అవుతాయి—

జఠరాగ్నిని పుట్టించి ఆకలి లేమిని తొలగిస్తుంది. రొమాంటిక్ నొప్పులను పోగొడుతుంది.

కఫ వాయు పిత్తములను శరీరావసరములకు తగినట్లుగా వుంచుతుంది.

బ్రహ్మచర్యమునకు, ఉత్తమ జ్ఞాపకశక్తికి మంచిది. తొడలు కాలు పిక్కలలోని నరములను శక్తివంతముగా వుంచుతుంది.

మితాహారముతో ఆత్మానుధ్యానము చేయవలెనన్న సిద్ధాసనము చాలా మంచిది.

సిద్ధాసనము సిద్ధించిన యెడల సావధానమైన ప్రాణ వాయువు కేవల కుంభకమునందు కట్టువడును. అనేక ఆసనముల ప్రయోజనము ఒక్క సిద్ధాసనములోనే లభ్యమగును. మోక్షగామియైనవాడు ఈ ఆసనమునే 12 సంవత్సరములు అభ్యసించిన యెడల యోగి అగును.



# స్వీకారం

" దాశరథి కవితా సమాలోచనం "
రచన : మాదిరాజు రంగారావు, వెల : రు. 6 00
ప్రతులకు : రసధుని పబ్లికేషన్స్, క్వార్టర్ నెం. 14
కాకతీయ విశ్వవిద్యాలయం, విద్యారణ్యపురి,
వరంగల్_506009

" ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు జీవిత చరిత్ర "
రచన : డి. రామలింగం, వెల : రు. 10_00
ప్రతులకు : శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం
సుల్తాన్‌బజార్, హైదరాబాద్ _ 500 001

" మీసాల సొగసులు " (హాస్య నవల)
రచన : పుచ్చా పూర్ణానందం, వెల : రు. 15_00
ప్రతులకు : పుచ్చా పూర్ణానందం, అడ్వకేట్
రామరాజ్యనగర్, విజయవాడ_520 012

" మగడా ! మగాడిలా బ్రతుకు " (నాటిక)
రచన : యన్. యస్. యన్. రెడ్డి, మేయర్
విశాఖపట్టణం. వెల : రు. 3_00
ప్రతులకు : వివేకానంద పబ్లికేషన్స్,
వివేకానందకాలనీ, అల్లిపురం, విశాఖపట్టణం.

" అశ్రువు " (కవితా సంపుటి)
రచన : కొనకంచి లక్ష్మీనరసింహారావు
వెల : రు. 8_00 ' X ' రే పబ్లిషర్స్
కొల్లూరిహౌస్, అమలాపురం_533 202 తూ.గో.జిల్లా

" (మా) నవలోకం " (కవితా సంపుటి)
రచన : బి. రాములు, వెల : రు. 5_00
ప్రతులకు : సారస్వతజ్యోతి మిత్రమండలి
సివిల్ హాస్పటల్‌రోడ్, కరీంనగర్_505 001

" HUMAN PERSONALITY "
Science & Philosophy
Written by : Bala Gangadhara Somayajulu, Amaravadi
For Copies : Y. Lokanatha Sarma
Advocate
Suryaraopet, Vijayawada – 2

# 1970లో అత్యధిక ఖర్చుచేసిన దంపతులు

అమెరికన్ ప్రెసిడెంట్ కెన్నడీ మరణానంతరం అతని భార్య జాక్వలిన్ ప్రపంచంలోని అత్యంత ధనికుడయిన ఇటాలియన్ వ్యాపారవేత్త అరిస్టోటిల్ ఒనాసిస్‌ని వివాహం చేసుకుంది. 1970 లో వారిద్దరి వ్యక్తిగతమైన ఖర్చు సంవత్సరానికి 2 కోట్ల డాలర్లు. బ్రిటిష్ ప్రభుత్వం తమ రాణి క్వీన్ ఎలిజబెత్ కోసం, ప్రిన్స్ ఫిలిప్ కోసం పెట్టే ఖర్చు కూడా అంత లేదు. ప్రపంచంలో ఏ భార్య, భర్తతో పోల్చిన ఆ జంట ఖర్చు అధికమే. 1970 లో వారిద్దరు పెట్టిన స్వంత ఖర్చు ఆ సంవత్సరం ప్రపంచంలో మరెవ్వరూ చెయ్యలేదు. సగటున వారానికి 384616 డాలర్లు ఖర్చు చేయటం కూడా పెద్ద సమస్యే. ఒనాసిస్ సంపాదన వారానికి 10 లక్షల డాలర్లు.

ఒనాసిస్‌కి ప్రపంచంలో మొత్తం ఆరుచోట్ల భవంతులు, నివాస యోగ్యమైన పెద్ద పడవ, రెండుచోట్ల శాశ్వతంగా హోటల్ గదులు వున్నాయి. ఆ ప్రదేశాలలో జాక్ ఒనాసిస్‌కి కావలసిన బట్టలు, టూత్ బ్రష్‌తో సహా ఇతర వస్తువులు సదా వుంటాయి. ఆమె ఓ ఇంటినుంచి మరో ఇంటికి వెళ్ళాల్సొస్తే, పెట్టెతో బట్టలు తీసుకెళ్ళాల్సిన అవసరం వుండదు. ఈ అన్ని ఇళ్ళలో కలిపి 202 మంది సేవకులు వున్నారు. ఆ దంపతులు ఎక్కడికి వెళ్ళినా వారి వెంట ఓ దర్జీవాడు, ముగ్గురు ఫ్రెంచ్ వంటవాళ్ళు వుంటారు. 202 మంది సేవకుల కిచ్చే జీతం సంవత్సరానికి 7,27,200 డాలర్లు. మరో మూడు లక్షలు వారి భోజనానికి ఖర్చవుతుంది. సేవకుల్లో ఎవరు గర్భవతులైనా వారి పురిటి ఖర్చుని ఒనాసిస్ తనే భరించడం నియమంగా పెట్టుకున్నాడు. అలాగే మరణించినవారి కర్మకాండ ఖర్చు కూడా భరిస్తాడు. ముసలివాళ్ళయిపోయిన వాళ్ళకి పెద్ద మొత్తం ఇస్తాడు ఉద్యోగంలోంచి తీసేసే ముందు. వీటికోసం సంవత్సరానికి 1393800 డాలర్లు సగటున ఖర్చవుతుంది. సంవత్సరానికి 20 లక్షల డాలర్లు తన ఇళ్ళలోని తోటలని మెయిన్‌టెయిన్ చేయడానికే ఖర్చవుతుంది. మరో 20 లక్షల డాలర్లు ఇంటిపన్నులకోసం ఖర్చవుతుంది. వారి పడవని మెయిన్‌టెయిన్ చేయడానికి సంవత్సరానికి 11,40,000 డాలర్లు ఖర్చవుతోంది. ఇంకా రక్షణ కోసం 84 వేల డాలర్లు, పిల్లల చదువు కోసం 2 లక్షల డాలర్లు, తన బంధువుల పోషణ కోసం సంవత్సరానికి 1,25,000 డాలర్లు, ఇతరులకి బహుమతులకోసం 11 లక్షల 18 వేల డాలర్లు, వివిధ ప్రదేశాలలోని కార్లకోసం 30 వేల డాలర్లు, పార్టీలకోసం 2 లక్షల డాలర్లు, ఇన్సూరెన్స్ కోసం 20 లక్షల డాలర్లు, ప్రయాణాలకోసం 1,78,000 డాలర్లు ఖర్చు చేస్తాడు.

అరిస్టాటిల్ ఒనాసిస్ ఆస్తుల మొత్తం విలువ 50 కోట్ల డాలరు.

## మనకు తెలియని ప్రపంచం

### మల్లాది వెంకటకృష్ణమూర్తి

## స్లోగన్స్

నేను చేస్తున్న
ఈ స్లోగన్లతో
సాధించేదేమిటని
నన్ను చూసి నవ్వకు నేస్తం!
రేపు నీకే తెలుస్తుంది
ఇవి అక్షరాల
'Slow Guns' అనే విషయం
"స్లో - గన్స్"

వేదాటి రఘుపతి

# తిలలు - చీరలు

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

తిలల నుండి వుత్పత్తి అయ్యే జిడ్డుగల ద్రవ పదార్థాన్ని తైలము అంటారు. కాలక్రమంలో పలు రకాల సన్యజన స్నేహానికి తైలమును అన్వయించటం జరిగింది.

తెలి ధాన్యాల ప్రసక్తి యజుర్వేదంలో కూడా కనిపిస్తుంది ( యజు 18—12 ). అథర్వ వేద మండలి తిథి సంబంధమగు సూక్త మొకదానిలో (అథర్వ 18.4 ) తిల, తైల, అన్న పదాలు పలుచోట్ల కనిపిస్తాయి. శ్రాద్ధ కర్మలలో పిండ రూపములోనున్న పితృలకు అభ్యంజన మొనర్చునపుడు 'అభ్యంజతం పితరః' అంటూ నూగులను నీళ్ళతో తోమి వదలవలసి వుంటుంది.

తిల శబ్దము చాల విస్తృతార్థాలలో ప్రయోగింపబడింది. మహాభారతంలో, 'తిల' విష్ణువు యొక్క తొడలనుండి పుట్టినట్లు చెప్పబడింది. అపర కర్మలలోను, శ్రాద్ధ క్రియలలోను 'నువ్వులు' అనివార్యం మృతుల తృప్తి కోసం 'తిలోదకమ్' యివ్వటం జరుగుతుంది. తిలోదక మివ్వటమంటే ఆ విషయంగా మనకున్న ఆశలన్నీ పూర్తిగా వదలుకోవటమే. త్యాగార్థకంగా యీ ప్రయోగం చేయబడుతున్నది.

నువ్వులు నల్లగా వుంటాయనో లేదా పితృదేవతలకు సంబంధించినవనో, మరెందుకోగాని, అనిష్ట పదార్థంగా భావిస్తుంటాము. నువ్వులు పాపగ్రహమగు శనికి ప్రీతిపాత్రమైన ధాన్యము. తిల దానం వల్ల శనిగ్రహ పీడ తొలగునని విశ్వాసము. తిల దానం, తైల దానం దుర్దానా లంటారు. సాధారణంగా తిలదానం పట్టేందుకు వెనుకాడతారు.

'తిల' శబ్దము నుండి 'తిలకం' ఏర్పడి వుండ వచ్చును. 'తిలకము' అంటే నువ్వు మొక్క, బొట్టు-పుట్టుమచ్చ-నల్ల గుఱ్ఱము అన్న అర్థాలున్నాయి. అనాదిగా తిలకం అంటే నుదుట పెట్టుకొను బొట్టు నువ్వుల రంగులో ( నల్లని ) వుండేది. కాలక్రమంలో నుదుట పెట్టుకొనే బొట్ల రంగులు మారినా 'తిలకమ్' అన్న పేరు మాత్రం స్థిరంగానే వుంది.

'తిలకము' ( కస్తూరి తిలకమ్ ) సౌందర్య పోషకమే కాక శ్రేష్ఠ వాచకంగా కూడా ప్రయోగములో వున్నది. రఘుకుల తిలకుడు. తిలకాశ్రయము అంటే నుదురు, లలాటము, బొట్టు పెట్టుకొను తావు.

నువ్వులు చాల చిన్న ధాన్యం అయినందున అల్పత్వానికి పర్యాయ పదంగా వాడుతుంటారు. 'మీ మాటల్లో తిలాంశమైనా వాస్తవం లేదు' అంటారు. తిలోత్తమ-తోటి అప్సర స్త్రీల కంటె తిలాంశమైనప్పటికీ ఎక్కువ అందము గలది.

తిల తండుల న్యాయము—సులభంగా విడదీయుటకు వీలైనది. తిల తండులము అంటే బాహ్య సంభోగా లింగన విశేషము—రతి బంధము అని నిఘంటుకారులు పేర్కొన్నారు.

భారత స్త్రీలు ధరించే చీరలు విదేశీ స్త్రీలను కూడా ఆకట్టుకుంటున్నాయి. ప్రస్తుతం 'చీర' అంటే స్త్రీలు ధరించే వస్త్ర పర్యాయంగా వాడుకలో వుంది. పౌరుష హీనుణ్ణి 'చీర కట్టుకొని రా' అంటూ ఎగతాళిగా

కొన్ని శతాబ్దాల క్రితం పురుషులు ధరించు వస్త్రాలను కూడా చీరలని వ్యవహరించేవారు.

సంస్కృత మందలి 'చీరమ్' యొక్క తద్భవమే చీర. తైత్తరీయ అరణ్యకములోను, బౌద్ధ జైన పురాణాలలోను 'చీర' పదం కనిపిస్తుంది. తైత్తరీయంలో పొడుగాటి వస్త్రము (కుట్లు లేనిది) లేదా తుండుగుడ్డను చీర అన్న అర్థంలో ప్రయోగించడం జరిగింది. బౌద్ధ జైన యతులు ధరించే గుడ్డలు అని ప్రచారములో వుండేది.

'చీర'కు ఆంగ్లంలో 'శారీ' పర్యాయ పదం. హిందీలో సాడి లేదా సాఢీ, కన్నడములో సీరె, తమిళంలో 'చీరై' అంటారు. క్రీ. శ. 1598 లో సాడి పదము ఆంగ్లమునకు వ్యాపించిందంటారు. సాడి, సాఢీ పదాలు సంస్కృత 'శాటీ' పదం నుండి పుట్టినవన వచ్చును. వశిష్ఠ విశ్వామిత్రాది మహర్షులు 'శాటీల'ను ధరించేవారు. మహాభారతములో 'శాటీ' పదం పలుమార్లు ప్రయోగింపబడినట్లు మోనియర్ విలియమ్స్ నిఘంటులో పేర్కొనబడింది. 'శటా' అంటే యోగులకున్న తల వెంట్రుకల ముడి (జటా). అరణ్య వాసమునకు వెళ్తూ సీతా రామలక్ష్మణులు నార చీరలు ధరించినట్లు రామాయణము చెబుతున్నది. నార చీరలంటే చెట్టు బెరడు నుండి తీసిన నారతో నేసిన వస్త్రాలు. నార మడి అంటే ఒక రకమైన నారతో నేసిన మడి వస్త్రము.

చీనాంబరము–చీనాంశుకము–చీనా దేశమునకు చెందిన పట్టు వస్త్రము. తల చీర అంటే తలపాగా. తెర చీర అంటే వేటాడునపుడు దాగి యుండుటకు తెరగా వుపయోగించు గుడ్డ (బ్రౌణ్య నిఘంటువు). చీర చాప ఓడలకు కట్టు తెర చాప—చీర చింపు. ఒక జాతి చేప–చీర చిక్కు–చీర చాల కుందుట అని నిఘంటువు చెబుతున్నది.

చీరావి అంటే దెబ్బ తగిలిన కంటికి ఆవిరి పెట్టుకొనుటకై గుడ్డ నోటిలో పెట్టుకొని వూది కలిగించు వేడి—గుడ్డ ఆవిరి.



# ఉంది నీలో చూడు ఈ నదీ రూపం

భూమితో సంభాషణతో గలగలలాడుతూ
హృదిలో దీపశిఖవంటి సంవేదనతో
ఆకాశాన్ని మోస్తూ గుండెపై నిండుగా
పైనుండి ఎగసిపోయే పక్షుల శ్రేణులతో
శూన్యాన్ని పల్లవితంచేసే సౌందర్యదృశ్యంతో
నాలో ప్రవహిస్తోంది నది.

నాలో ప్రవహిస్తోంది నది
పేర్చిన మొగలి రేకుల పంక్తిగా
దూకిన ఉదయ హంసే యానమై
నిఖిల సంస్కృతి దరులు ఒరసే
మానవుని పరిణామదశలకు సాక్షియై
నాలో ప్రవహిస్తోంది ఆశాబింబమై.

నాలో ప్రవహిస్తోంది నది
ఒక్కొక్కపుడు వేలాదిప్రాణుల్నిహతమార్చే
నియంతవలె తుపాను బీభత్సంతో,
దుస్స్వప్నం అంతమై, తీరభూమి, మైదానం
కళ్ళలో పెదవులపై శరీరం అణువణువూ
కుట్మలించి సుమించి పరిమళించే లాస్యంతో.

నాలో ప్రవహిస్తోంది నది
దారి చేసుకొని అవనిపై పోరాడుతూ
బలంగా వేగంగా స్వేదజలాపూర్ణమై,
బాధల్ని కరగిస్తూ భయాన్ని దూరం చేస్తూ
స్వేచ్ఛా సమాజ శక్తికి సంకేతమై
ఉంది చూడు నీలో! ఈ నదీ రూపం.

— మాదిరాజు రంగారావు

" ..నా బాధ అదేరా శేఖర్! అందమైన ఆడపిల్లని ఎవరైనా చేసుకుంటారు. అంతస్తులున్నా కళ్ళు కద్దుకొని చేసుకుంటారు.

కాని కుంటి, గ్రుడ్డి, మూగ, నత్తి మున్నగు అవయవ లోపాలున్న అభాగినులు జీవితంలో చేదునే రుచి చూస్తూ కుమిలిపోతున్నారు. అలాంటి వాళ్ళనెవరు కన్నెత్తి చూస్తున్నారు ?

అందుకే నేనీ రెండవ కోవకు చెందిన యువతిని చేపట్టి కొందరికైనా మార్గదర్శకుణ్ణి కావాలనుకుంటున్నాను. అలా చేసినందువల్ల ఆత్మసంతృప్తి మాత్రమే కాకుండా ఆ అమ్మాయి కృతజ్ఞతలు కూడా మనకు లభిస్తాయి. నేను కాకపోయినా అప్సరసలాంటి సునీతను ఎవరైనా కళ్ళకద్దుకొని పూజించుకుంటారు.




మామయ్య చిన్నప్పుడే రంగూన్ వెళ్ళిపోయి బాగా సంపాదించుకొచ్చాడు. తల్లి లేనిదని సునీతను అతి గారాబంగా చూచుకొంటున్నాడు. ఆమె అందాన్ని, ఆస్థిని చూచిన వారెవరైనా ముందు కురుకుతారు. అమ్మా, నాన్నా నన్ను బలవంతం చేస్తున్నారు కాని నా మనసు మారదు. అంగవైకల్యంతో బాధపడుతూ తనకీ జీవితంలో పెళ్ళి కాదనుకొనే ఒక కన్యకు నా జీవితం అంకితం చేస్తాను. అదే నా జీవితాశయం."

ఇట్లు,

నీ మిత్రుడు, రఘు.

ఉత్తరం మరోమారు చదువుకొని పోస్టుచేసి వచ్చాడు రఘు. అందచందాల్లో, తెలివితేటల్లో సాటిలేని సునీత తనమీద బావకు మనసు లేదని ఉడికిపోయింది.

ఆరోజు ఉదయాన్నే తలంటు స్నానంచేసి దేవకన్యలా వెలిగిపోతూ తోటలో పూసిన గులాబితో బావను సమీపించింది. " బావా! విరియబూసిన ఈ అందం, తీయనైన నా హృదయం ఈ గులాబితో పొందుపరచి సమర్పించుకుంటున్నాను. దీన్ని స్వీకరించి నా జన్మకు ధన్యత చేకూర్చు " అన్నది ముగ్ధమనోహరంగా.

తన జీవితాశయాన్ని గాఢంగా ప్రేమించిన రఘు ఆ ప్రేమ కుసుమాన్ని తృణీకరించాడు. ఆ లలన బ్రతిమాలింది. కోప్పడింది, అయినా హీరో జంకలేదు. 'నిన్నే పెళ్ళాడుతా' నంటూ 'మంగమ్మ శపథం' చేసింది. కాని రఘు చలించలేదు. కాని అతను తన

నిశ్చయాన్ని మార్చుకోక తప్పలేదు. తన అన్న కూతుర్ని చేసుకోకపోతే బావిలో దూకి చస్తానంది అమ్మ. అది బావిలో దూకితే నేను రంగూన్ వెళతానన్నాడు నాన్న. ( బహుశా తాను కూడా లక్షాధికారి కావాలనుకున్నాడేమో ) మావయ్య వీళ్ళద్దరినే బలపరుస్తున్నాడు. ఇంతటి పద్మ వ్యూహంలో చిక్కుకున్న రఘుకు ముందు దారి కనిపించలేదు. చివరిసారిగా తన ప్రాణమిత్రుడైన శేఖర్ని సలహా అడిగాడు. సిగరెట్టు దమ్ము ఘాటుగా లాగుతూ అంతా విన్నాడు శేఖర్.

" సరే ! రేపు కనిపించు. ఆలోచించి చెప్తా ! " తీవిగా అన్నాడు చివరిసారిగా లాగిన పొగనంతా అతని ముఖంమీద వదుల్తూ. రఘుకు చెడ్డ చిరాకేసింది. చెప్పొద్దూ మరి చాచి లెంపకాయ కొట్టాడు. దెబ్బతో ఈ లోకంలోకి వచ్చాడు శేఖర్.

" అయితే యిపుడు నన్నేం చేయమంటావు ? " యేడుపు ముఖంతో అడిగాడు పదో తరగతితోనే చదువుకు గుడ్ బై చెప్పిన శేఖర్. ఇక ఏం లాభం లేదని ఇంటికి వచ్చేశాడు రఘు.

రఘుకు ' వద్దంటే పెళ్ళి ' జరిగిపోయింది ' జయం మనదే ' అంటూ గెలిచిన సునీత మాత్రం రఘు అనురాగాన్ని, ఆప్యాయతనూ పొందలేకపోయింది.

పెళ్ళి జరుగక ముందు యెలా వుండేవాడో తర్వాత కూడా అలాగే వున్నాడు. కాకపోతే మునుపటి ఉత్సాహం లేదు. తన జీవితాశయాన్ని మసి చేసిన సునీత అంటే పరమ అసహ్యం వేసిందతనికి. అసలు అతను ఆమె ఉనికినే భరించలేకుండా వున్నాడు.

తన బాధలన్నీ మరచిపోయేందుకు కథా రచనలో నిమగ్నుడయ్యాడు. కొన్నాళ్ళకు అతను వ్రాసిన ' ప్రేమించి బాధపడకు ' కథకు మొదటి బహుమతి లభించిందంటూ ఏదో పత్రిక నుండి వర్తమానం వచ్చింది. అక్కడి కెళ్ళి తిరిగి వచ్చిన రఘుకు సునీత కనిపించలేదు. లోపలి కెళ్ళేసరికి కళ్ళకు కట్టు కట్టుకొని విచారంగా కూర్చుని వున్న సునీత కనిపించింది. మొట్టమొదటి సారిగా " సునీతా ! " అంటూ పిలిచాడు.

రఘు స్వరం గుర్తుపట్టిన సునీత " యేమండీ " అంటూ ముందుకు రాబోయింది. ప్రక్కనే వున్న కుర్చీ తగిలి బోర్లా పడబోయిన సునీతను పొదివి పట్టుకోకుండా వదిలి వుంటే ఆమె ముఖం పచ్చడి అయి వుండేది.

" ఏమండీ ! మిమ్మల్ని బాధ పెట్టినందుకు తగిన శాస్తిగా కళ్ళు రెండూ పోయాయండీ ! " అంటూ బావురుమని యేడ్చింది సునీత.

" ఎలా జరిగింది ? " అని మాత్రం అనగలిగాడు రఘు.

" వద్దండీ ! ఆ భయంకర సంఘటన గుర్తు చేయకండీ ! " యేడుస్తూ అతన్ని పెనవేసుకుపోయింది.

ప్రతి చిన్న విషయానికి తడుముకుంటూ అవస్థ పడుతున్న సునీతను చూస్తే రఘు హృదయం ఆర్ద్రమయ్యేది. జీవితం అంటే ఏమిటి ? గంభీరమైన సాగరంలో అలలు లేచే విధంగా జీవితంలోనూ అంతటి ఒడిదుడుకులు సంభవిస్తూ వుంటాయి. కలలో కూడా వూహించని నిజాలు తలచుకొన్నపుడు శ రీ రం జలదరిస్తుంది. సునీతకు కళ్ళు పోయాయంటే రఘుకు యేదోగా ఉంది.

ఇలాంటి సమయంలోనే రఘుకు నెల్లూరుకు బదిలీ అయింది. సునీతతోబాటు అతడు నెల్లూరు వెళ్ళిపోయాడు. సునీత కట్లు విప్పేశారు. చూపు రాలేదు. సునీత మాత్రం అన్నీ పోగొట్టుకొన్న దానిలాగా, విచారంగా వుండేది. ప్రతి పనికి కష్టంగా వుంది రఘుకు. పని మనిషిని పెట్టుకొనేందుకు ఇష్టంలేదు. సునీతమీద కోపంతో లక్ష లాస్తిని వదిలేశాడు. అయినా అధైర్య పడలేదు. అన్ని వసతులు గల యిల్లు సుమారైన ధరకు అద్దెకు తీసుకున్నాడు. ఇల్లు ఊడ్చడం, నీళ్ళు చేదడం, వంట పని, బైట పని అన్నింటికి తానొక్కడే.

సునీత బాధపడేది.

" మీరు వద్దంటున్నా దురదృష్టాన్ని మీ మెడకు తగిలించాను. పాపిష్టిదాన్ని. నా వల్ల మీ కెలాంటి సహాయం లేకపోగా బోలెడు కష్టం." అంటూ సునీత కళ్ళనీళ్ళు పెట్టుకొంటూ వుంటే రఘు హృదయం ఒక విధమైన ఆనందాన్ని పొందేది. తన బాధంతా సునీత గ్రహిస్తూ వుంది. ఆమెను తానెంత గాఢంగా ప్రేమించేది తెలిస్తే తన కంతే చాలు.

రోజూ సునీతను ఒక ప్రక్కన కూర్చోబెట్టి కులాసాగా కబుర్లు చెప్తూ వంట పుగించేవాడు. ఆఫీసు నుండి రాగానే స్నానంచేసి సునీతను చేయి పట్టుకొని పార్కుకు తీసికెళ్ళేవాడు. అక్కడ తమ ఆఫీసు కబుర్లు, అవి, యివి చెప్పి నవ్వించేవాడు. ఆమెకు కళ్ళు లేవనే బాధ, భావన లేకుండా చేసేవాడు. ఇలాంటి భర్త దొరకడం తన అదృష్టమని మురిసిపోయేది సునీత.

" సినిమా కెళదామండి ! " అంది సునీత ఓ ఆదివారం నాడు.

" ఎందుకు సునీతా ! నువ్వు చూడలేనిది నేను చూస్తే నాకు తృప్తి వుండదు." ఆమెను దగ్గరకు తీసుకుంటూ అన్నాడతను.

" ఎందుకు చూడలేనూ ! మీరు నా ప్రక్కనే ఉంటారుగా మీ కళ్ళతోనే చూస్తాను " అంది.

సినిమాలో యేం జరిగింది విపులంగా చెప్పేడు రఘు. సునీత చాలా సంతోషపడింది. రఘు తృప్తిగా నిట్టూర్చాడు.

రోజూ ఉదయం నిద్ర లేచింది మొదలు రాత్రి నిద్రపోయే వరకు విరామంలేని పని వుండటం వల్ల విపరీతంగా అలసిపోయేవాడు రఘు. ఆ బాధ సునీత గ్రహించేది. అందుకే రాత్రిళ్ళు అతన్ని సుఖ సంతోషాలలో ముంచి తేల్చేది. రఘు తన బాధనంతా క్షణంలో మర్చిపోయేవాడు.

ఆ రోజు రఘు మధ్యాహ్నం ఇంటికి వచ్చేశాడు. సునీత పెల్రిగాం చూస్తూ వుంది. రఘును చూడగానే—
" ఏమండీ మా నాన్నగారు పోయారుట " అంది యేడుస్తూ.

అంటే......సునీతకు కళ్ళు కనిపిస్తాయన్నమాట. రఘు ముఖం మ్లానమైంది. తల తిరిగినట్లయింది. తూలి పడబోయాడు. సునీత అతన్ని పట్టుకొని లోనికి తీసుకు వెళ్ళింది. మంచంమీద పడుకున్న రఘు మౌనంగా ఆమె కళ్ళలోకే చూస్తున్నాడు.

" క్షమించండి ! ఇంతకాలం కావాలనే మిమ్మల్ని మోసం చేశాను. మీ కిష్టం లేకపోయినా మన పెళ్ళి జరిగిపోయింది. పెళ్ళయితే జరిగిందిగాని భార్యగా మీ అనురాగాన్ని, అప్యాయతను పొందలేకపోయాను.

నా మనస్సు పరిపరి విధాల పోయింది. మీ జీవితాశయం తెల్సింది. అంగ లోపాలు కలిగిన పడతులకు మీ హృదయంలో స్థానం వుంది కాని నాకు లేదు అని తెలుసుకున్నాను. అందుకే ఒకటి ఆలోచించాను. దేవుడిచ్చిన అందం ఈ విధంగా నిరర్థకం చేసుకోనేందు కన్న ఒక గ్రుడ్డిదానిలా నటించి మీ ప్రేమ పొందగలగటం భావ్యమనిపించింది. అందుకే నేను గ్రుడ్డిదానిగా నటించి మిమ్మల్ని మోసపుచ్చాను. మీ నుండి జన్మ జన్మలకు మరపురాని ఆప్యాయతను, అనురాగాన్ని పొందగలిగాను. ఒక విధంగా మీ కోరిక కూడా తీరుతుందని ఆలోచించి ఈ పని చేశాను. వెయ్యి అబద్ధాలాడి ఒక పెళ్ళి చేయ మంటారు. కాని నేను ఒకే ఒక అబద్ధమాడి నా జీవితం నిలుపుకోవాలనుకున్నాను. ఇందుకు మీరు ఏ శిక్ష విధించినా సంతోషంగా స్వీకరిస్తాను. " వెక్కి వెక్కి ఏడుస్తూ అతని హృదయంపై వాలిపోయింది.

రఘు మౌనంగా ఆమె ముంగురులు సవరిస్తూ వుండిపోయాడు.

" నువ్వు నిజంగా అదృష్టవంతుడివిరా ! అపురూప లావణ్యవతి భార్యగా దొరికింది. " అన్న శేఖరు మాటలు గుర్తుకు వచ్చాయతనికి.



# పిచ్చుక - పుట్టు పూర్వోత్తరాలు

పెంపుడు పక్షి కాకపోయినప్పటికి పెంపుడు పక్షుల కన్నా ఎక్కువ హడావుడి చేస్తూ అందరి ఇళ్ళలో కనిపించే పక్షి పిచ్చుక. ఎందువల్లనో కాని, పక్షులన్నింటిలోకి మానవుడికి అతి దగ్గరైంది పిచ్చుక. మనుష్య సంచారం లేని ఇంటిలో ఒక్క క్షణంకూడా పిచ్చుక వుండకపోవటం ఒక విశేషం.

మానవుడి జీవితంతో అంతగా పెనవేసుకపోయిన ఈ పక్షి సుమారు రెండు కోట్ల సంవత్సరాల క్రితం ప్రకృతిలో ఉద్భవించింది. ప్రస్తుతం ఆఫ్రికా ఖండమున్న ప్రాంతం దీని జన్మస్థానము. అక్కడినుండి బయలుదేరిన పిచ్చుక ఆసియా, ఐరోపా ఖండాలంతట వ్యాప్తి చెందింది. గడచిన రెండువందల సంవత్సరాలలో అమెరికా, ఆస్ట్రేలియా ఖండాలకు వలస వెళ్ళిన తెల్లవారు పిచ్చుకను అక్కడికి చేర్చారు. ప్రస్తుతం ఒక్క చైనా దేశంలో తప్పించి మిగిలిన ప్రపంచదేశాల్లోని ప్రజలందరి ఇళ్ళల్లో కనిపిస్తుంది పిచ్చుక.

పిచ్చుకలు ఎంతో తెలివైనవి. ఏ విషయాన్నయినా ఇట్టే నేర్చుకోగలవు. తెలివితేటల విషయంలో కోతి స్థాయికి దగ్గరలో వుంటుంది పిచ్చుక. అవసరమైతే పిచ్చుకలు నీటిలో మునిగి ఈదగలవు కూడ.

పిచ్చుకలు అంత త్వరగా జోడు కట్టవు. మగ పక్షి అనేక రకాలుగా గాలిలో పల్టీలుకొట్టి ఆడపక్షిని ఆకర్షించి అతి కష్టంమీద సంసారంలోకి దించుతుంది. ఒకసారి జోడుకట్టిన పిచ్చుకలు విడిపోవు. మగపక్షి విడిపోవటానికి ప్రయత్నం చేసినా ఆడపక్షి వూరుకోదు. మనదేశంలో పిచ్చుకలు సంవత్సరం పొడవునా గుడ్లు పెడతాయి. సంతానం విషయంలో బాధ్యతను మగ ఆడ పక్షులు సమంగా పంచుకుంటాయి. ఆడ పిచ్చుక ఆహారాన్ని




సంపాదించుకవస్తుంది. మగ పిచ్చుక గూటిని నిర్మించటం శత్రువుల బారినుండి పిల్లల్ని రక్షించటం చేస్తుంది.

ఎగరటం నేర్చుకున్న పిల్ల పిచ్చుకలు, తల్లి పిచ్చుక గూటికి సమీపంలోనే మరోగూడు నిర్మించుకుని కాపరం చేస్తాయి. ఆ విధంగా ఆ ప్రాంతంలో ఒక పిచ్చుక కుటుంబం ఏర్పడుతుంది. ఈ కుటుంబంలోని పిచ్చుకలు ఏ పనిచేసినా సామూహికంగా చేస్తాయి. సామూహికంగా పిచ్చుకలు చేసే స్నానం చూడటానికి ముచ్చటగా వుంటుంది.

పిచ్చుక జీవితం ప్రమాదాలతో కూడుకున్నది. కాకులు, గద్దలు, గుడ్లగూబలు పిల్లులు వగైరాలన్నీ పిచ్చుకలను, వాటి గుడ్లను భుజిస్తాయి. తొంభై శాతం గుడ్డు దశలోనే మరణిస్తాయి. మిగిలిన వాటిలో ఎక్కువ భాగం సంవత్సరం తిరగకుండానే మరణిస్తాయి. అందువల్ల పిచ్చుక జీవిత కాలమెంతో ఖచ్చితంగా చెప్పటం కష్టం. ఒక పిచ్చుక బెల్జియం దేశంలో పెంపుడు పక్షిగా పదకొండు సంవత్సరాలు జీవించినట్టు నమోదై వున్నది.

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు



# కటుక రోహిణి



ఇది గుల్మజాతి మొక్క. హిమాలయ ప్రదేశములందు ఇది విస్తారముగా నుండును. దీని వేర్లనే ఔషధములకు వాడుచున్నారు. దీని ఆకులు కొంచెము పొడవుగా నుండి కుక్కపొగాకును పోలియుండును. పూవులు నీలివర్ణము గలిగి గుత్తులు గుత్తులుగా పూయును. దీనిలో రెండు జాతులు కలవు నీలిరంగు గలదొకటి, పచ్చరంగు గలదొకటి.

## వైద్యవాణి

దీని గుణగణాలను పరిశీలించిన, చేదు రుచి కలిగి యుండును, వేడిచేయు స్వభావము గలది, విపాకమున కారపు రుచిగా మారును, బాగుగా విరేచనము చేయుననియు తెలియును. ఆయుర్వేద మందుల దుకాణంలో కటుకరోహిణీ తప్పక దొరుకును.

కటుకరోహిణీ, యష్టిమధుకము మెత్తగా నూరి పంచదార నీళ్ళతో కలిపి సేవించిన హృద్రోగములు శమించును, కటుకరోహిణి, గైరికము సమానములుగా చూర్ణించి తేనెతో కలిపి సేవించిన ఎక్కిళ్ళు శమించును.

కటుకరోహిణీ ఉసిరికాయంత ముద్ద వేడి నీటిలో కలిపి కొంచెము పంచదార వేసి త్రాగిన విరేచనము కలిగించి కఫ, పిత్త, వాత జ్వరములను పోగొట్టును. కటుక రోహిణీ గుంటగలగరాకు రసముతో ఒక వారంరోజులు మర్ధించి, కందగింజంత మాత్రలు చేసి, అల్లపు రసముతో నిచ్చిన చలిజ్వరములు కట్టును. చిట్టి నారమట్ట రసంతో కటుకరోహిణి మెత్తగా నూరి గుండెలకు పట్టువేసిన గుండెలలో పీకు నొప్పి నొప్పి తగ్గుటయేకాక శ్లేష్మము కరిగి ఆయాసము తగ్గును. నల్ల కటుకరోహిణీ కంటె తెల్లది తీక్షణ గుణములు కలిగియుండును కాన వాడుకలో నల్లదానికంటే తెల్లది తక్కువ మోతాదులో వాడవలెను.

పిల్లలకు వచ్చెడి జ్వరములకు కూడా దీనిని ఎక్కువగా వాడెదరు. కడుపులో నులి పురుగులను చంపుటకు వారికి అప్పుడప్పుడు పట్టెదరు, దీని వ్రేళ్ళు పాలతోగానీ, నీటితోగానీ నూరి తాగిన స్తన్యము శుద్ధమగును.

గమనిక : కటుకరోహిణీ లోనికిచ్చు మోతాదు ఎక్కువైనచో బాదమునూనెగాని, బాదము పప్పుగాని విరుగుడు వస్తువుగా వాడవలెను.

— యస్. యన్. దుర్గారావు

# విశ్వాసం మూఢమా ?

ఒక నాస్తికుడు ఓ ఆస్తికుణ్ణి ప్రశ్నించాడట "దేవుడున్నాడు అని మీరేదో మా గొప్పలుగా చెప్తున్నారు కదా! అదిగో ఆ ఈశాన్యప్రాంతంలో భూకంపాలొచ్చి చాలా జననష్టం జరుగుతున్నది. మీ దేవుణ్ణి ఆపమని చెప్పకూడదు?" ప్రశ్న విన్న ఆస్తిక పెద్దమనిషి ఫక్కుమని నవ్వి 'నిజమేనయ్యా! మా దేవుడు ఆపలేడు, కాని అంతా మా ప్రజ్ఞే అంటున్న మీరెళ్ళి ఆపవచ్చు కదా?" అని ఎదురు ప్రశ్న వేశాడు. పాపం ఆ నాస్తికయ్యగారు మారు మాట్లాడకుండా చక్కా వెళ్ళిపోయాడు. ఆలనాడు విష్ణుమూర్తి పొడగిట్టని హిరణ్యకశిపుడు కూడ యిలాటి మాటలే అనేవాడు, చర్యలుకూడ అదే ఫక్కీలో చేసేవాడు. నిష్కల్మష హృదయంతో, పరిపూర్ణ విశ్వాసంతో ఆ శ్రీహరిని నమ్ముకున్న ప్రహ్లాదుడు ప్రశాంతచిత్తంతో తండ్రి మాటలు వినేవాడు, ఆయన పిచ్చి చేష్టల్ని భరించేవాడు. అయితే వూరుకున్నాడా ఆ రాక్షసరాజు? అబ్బే! వూరుకుంటే వూరా? పేరా? అందుకని తనయుణ్ణి సతాయించటం మొదలెట్టాడు. "ఇక్కడ అక్కడ ఎక్కడయినా వుంచే నీ మాయలమారి ఈ స్తంభంలో వున్నాడేమో చూపించు?" అంటూ మొండి ప్రశ్నవేసి స్తంభాన్ని నాలుగు తన్నులు తన్నేటప్పటికి భీకర ప్రళయగర్జనలో నృసింహమూర్తి బయటకు రావటం ఆ రాక్షసరాజును హతమార్చటం క్షణాల్లో జరిగిపోయాయి. కర్నాటక రాష్ట్రి వుదంతం పేపర్లో చదివింతర్వాత ఆ విషయాలు జ్ఞప్తికి రానారంభించాయి.

ఆ రాష్ట్రింలో మండే ఎండలకు భూములు మాడిపోతున్నాయట. కృత్రిమ మేఘాల సృష్టివల్ల వానలు కురుస్తాయనుకున్నారటగాని ఫలితం కరువయింది. సరే ఆధ్యాత్మిక శక్తులవల్ల వర్షం కురిపిస్తానన్న శివబాలయోగిగారిని ఆ రాష్ట్రి ప్రభుత్వం ఆహ్వానించింది. ఆ ఆహ్వానం పట్ల అసమ్మతి తెలిపినవారికి ముఖ్యమంత్రి హెగ్డేగారు చక్కని సమాధానంకూడా యిచ్చారు. "తప్పేమిటి? వారు కురిపిస్తామంటున్నారు కదా! ఒక అవకాశంయిచ్చి చూద్దాం" అన్నారాయన. యింతవరకు బాగానేవుంది. కాని ఆ రాష్ట్రింలో కాకలు తీరిన హేతువాది డా॥ హెచ్. నరసింహయ్యగారు "శివబాలయోగిని వర్షం కురిపించమని రాష్ట్రి ప్రభుత్వం కోరటమంటే విజ్ఞానానికి, తీరని హాని కల్గించటమే" అని ఆవేదన వ్యక్తం చేసారు. అంతే కాకుండా ఆయన యింకోమాట కూడా అన్నారు. బెంగుళూరు నగరంలో టెలిఫోన్లు బాగా పనిచేసేటట్లు యోగిగారు చూడగలిగితే టెలిఫోను అధికారులు ఆయనకు కృతజ్ఞులై వుంటారు అని. వీరి వాదనను బలపరుస్తూ విజయవాడ నగర నాస్తిక మహాశయులుకూడా పత్రికా ప్రకటనలుచేసి ప్రజాక్షేమం కొరకు తమ తపశ్శక్తిని వుపయోగించి కర్తవ్యాన్ని నెరవేర్చమని యోగిగార్ని కోరారు.




అప్పుడోసారి బొంబాయి నగరంలో ఓ మహర్షిగారు తాను నీటిమీద నడుస్తానని బ్రహ్మాండమయిన ప్రచారం చేసారు. యింకేముంది, విదేశీ టి. వి. కెమెరాలు, పాత్రికేయులు, ఫోటోగ్రాఫర్లు అంతా ఆత్రంతో గుమికూడారు. ఎప్పుడు నీటిమీద కాలువేస్తాడో, అడుగులు ఎలా పడతాయో అని తదేక దీక్షతో చూడనారంభించారు. అంతే .... అనుకున్న సమయానికి యోగిగారు నీటిమీద కాలు వేయటం, మునిగిపోవటం జరిగింది. అంతా ఫక్కున నవ్వారు. పాపం యోగిగారు చిన్నబుచ్చుకున్నారు. మొన్నీ మధ్య

విజయవాడ నగరంలో కూడా యిలాంటిదే జరిగింది. పెట్టెలోపెట్టి కృష్ణానదిలో పడేసిన వ్యక్తి బెంజి సర్కిల్ దగ్గర ప్రత్యక్షమవుతాడని ఓ కథ ప్రచారం చేసారు. ప్రభుత్వ అధికారుల సమక్షంలో అంతా సజావుగా జరిగిందనుకునేసరికి ఎవడి కంటపడ్డాడో, తప్పించుకుని కారు ఎక్కబోతున్న వాణ్ణి జనం చుట్టుముట్టారు. తర్వాత ఆయనేదో వివరణ యిచ్చాడనుకోండి. అదివేరే విషయం.

అతీంద్రియ శక్తులుకాని, భగవదారాధన కాని మరో విశ్వాసం కాని సమాజానికి చెరుపు చేయనంతవరకూ ఎవరూ అభ్యంతర పెట్టనవసరం లేదేమో. అనేక విశ్వాసాల కలయిక యీ మానవ సమాజం అని నమ్మతున్నప్పుడు దేవుడన్నాడు అని నమ్మేవారిని కించపరిచే మనస్తత్వాన్ని ఏమని పిలవాలి ? పైశాచిక ప్రవృత్తి అనవచ్చా ! అసలు వ్యక్తి జీవితం ఎంత ? మహా బ్రతికితే వంద సం॥లు అనుకుందాం ? యిందులో సగం నిద్ర కోసం పోతుంది. మిగిలిన సగములో ఒక పావు రోగాలు, రొష్టులు, ఆసుపత్రులు, మందులు. యిక మిగిలిన పావులో జీవనభృతి వెతుకులాటే సరిపోతున్నది కదా ? మరి యీ అనంత సృష్టి రహస్యాన్ని కనుక్కొనేందుకు యితని జీవితం సరిపోతుందా ? ఇన్ని కోట్ల జీవరాసులు, వేటికి వాటికి వైరుధ్యం, కంటికి కనిపించని సూక్ష్మజీవుల్లో కూడా అమోఘమైన చైతన్యం. ఇన్నికోట్ల మానవకారాలలో ఏ ఒక్కటీ ఒకటిగా వుండక పోవటం-క్రమబద్ధమైన రాత్రింబవళ్ళు, ఋతువులు, ఏమిటిదంతా? ఎవరయినా విడమర్చి చెప్పగలరా ? ఎవడో ఓ బ్రహ్మాండమయిన సృష్టికర్త వున్నాడు, అతని అదుపాజ్ఞలలోనే యీ విశ్వమంతా పరిభ్రమిస్తున్నది అని ఎవరయిన విశ్వసిస్తే అందుకు అడ్డుపుల్ల వేయవల్సిన అవసరం ఎందుకొస్తుంది. మనం విశ్వసించనిది ఏదయినా మూర్ఖము, మూఢము, అవుతుందా ? అభ్యుదయము, హేతువాదము మనసొత్తు, మిగతావారంతా అంధులు సమాజహంతకులు అవుతారా ? అర్థం పర్థంలేని తర్కాలు. అతీంద్రియ శక్తులతో వానలు కురిపించేవారు కురిపించవచ్చు. కాని యిదే సమయంలో హేతుబద్ధంగ ఆలోచించేవారు సైన్స్ సహాయంతో వర్షాలు కురిపించవచ్చు కదా ? యిక తగాదా ఎక్కడిది ? ఎవరి మార్గంలో వారు పయనించవచ్చు.

ముక్కు మూసుకుని తపస్సు చేసుకుంటున్న యోగుల తపస్సును పరీక్ష చేయాలనటం, దేవుడున్నాడని నమ్మే వాళ్ళను అంధ విశ్వాసకులుగా చిత్రీకరించటం యీనాడు కొందరికి ఒక వృత్తిగా పరిపాటయిపోయింది. ఎదుటివారి విశ్వాసాలను కించపరచటమే వీరి ధ్యేయంగా కనబడుతున్నది కాని సమాజానికి వీరు చేస్తున్న సేవేమిటో ఎక్కడా గోచరం కావటంలేదు. విశ్వాసకులంతా వారి దృష్టిలో గొర్రెల మందలే. తామొక్కరె అభ్యుదయ పధాన నడుస్తున్నామని కలలు గంటున్నారు. సమాజ శ్రేయస్సే అందరి ధ్యేయం అనుకున్నప్పుడు ఎవరి మార్గంలో వారు అందుకు పాటుపడాలి. ఇక్కడ ఘర్షణకు తావులేదు "మానవుడు ప్రాయికంగా, వస్తుతః హేతువాది. ప్రతి మానవుడి ప్రవర్తన ఎంత అహేతుకంగా కనిపించినా చివరికది హేతుబద్ధంగా వుద్దిష్టమైనదే" అన్న యం. యన్. రాయ్ మాటల మననం అందరి కళ్ళు తెరిపిస్తుంది.

"వేదశాస్త్రములు తెలిసినవారే ఎరుగరు సృష్టివిలాసం? అల్పబుద్ధితో జ్ఞానదాతనే సలపకు పరిహాసం" అన్న కవి పలుకులు అందరికీ శిరోధార్యం కాగల్గినపుడు వాదాలకు తావే వుండదు.

* * *

# మైలు రాళ్ళు ' ఫర్లాంగు రాళ్ళు !!

కొన్ని వస్తువులు, విషయాలు, వ్యక్తులు కాల గమనంలో కలిసిపోయినా, వాటి తాలూకు గుర్తులు మన జీవితంలో, సాహిత్యంలో, సామెతల్లో మిగిలిపోతుంటాయి. వాటిలో ' మైలు రాయి ' ఒకటి. మైళ్ళు, ఫర్లాంగులు పోయి, మీటర్లు, కిలో మీటర్లు వచ్చి చాలాకాలమయినా, ఈ రోజు కూడా రహదారిమీద వున్న కిలో మీటరు రాయిని కూడా మైలురాయిగానే వ్యవహరించటం కద్దు. అంతే కాకుండా ఫలానా సంఘటన, ఫలానా వారి జీవితంలో మైలురాయి వంటిదని చెపుతామే కాని కిలో మీటరు రాయివంటిదని చెప్పం.

మొన్నీ మధ్యన జరిగిన ఒక చిన్న సంఘటన కారణంగా యిదంతా చెప్పవలసి వచ్చింది. గుంటూరుకు చెందిన ప్రముఖ వైద్యులు, ప్రస్తుత శాసన సభ్యులు అయిన డా. సదాశివరావుగారితో కలిసి ఒక విషయమై ఒక జిల్లా అభివృద్ధి అధికారిని కలవవలసి వచ్చింది. కుశల ప్రశ్నలు, మంచీ మర్యాదలు పూర్తయిన తర్వాత విషయ ప్రస్తావన చేశాం. మేము ప్రస్తావించిన విషయాన్ని గురించి ఆయన ఏవో వివరాలు చెప్పసాగాడు. ఆ విషయానికి సంబంధించిన పూర్తి జ్ఞానము, వివరాలు, రూల్సు మా యిద్దరికీ సంపూర్తిగా తెలుసునన్న విషయం పాపం ఆ జిల్లా అభివృద్ధి అధికారికి తెలియదు: మే మిద్దరం చిరునవ్వు నవ్వుకుంటూ ఆయన చెప్పిన దానికి తలవూపి మీ పైన పెద్దాందార్లతో మాట్లాడుతాములే, అని చెప్పి వచ్చేసాం.

బయటకు వచ్చిన తర్వాత తిరుగు దారిలో నేను ఆ అధికారి అజ్ఞానాన్ని గురించి ప్రస్తావించగా, డాక్టరు గారు చిరునవ్వు నవ్వుతూ " ఏం చెపుతాము. ఈ అధికారులు తాము మైలురాళ్ళ వంటివారమనుకుంటారు. కాని పాపం వారికి తెలియదు. వారు మైలురాళ్ళ వంటి వారయితే, మేము (అనధికారులు) ఫర్లాంగు రాళ్ళ వంటి వారమని. త్వరగా పోయినా తరచు వస్తుంటామన్న సంగతి వారు గ్రహించరు. " అని ఒక మిత్రుడు చెప్పిన విషయాన్ని గుర్తు చేశారు.

## చేదుమాత్ర

## వయ్యాపి

మన పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో అధికారులు చాలా కీలకమయిన పాత్ర వహిస్తున్న విషయం మనందరకూ తెలిసినదే. అయితే వీరిలో చాలామంది ఈ రాజ్యం చేసేది తామేనని, ఈ అనధికారులు 5 సంవత్సరాల కొకసారి పోతూ వుంటారని భావిస్తూ రైతు నడిపే రెండెడ్ల బండి క్రింది పెంపుడు కుక్కల్లా బండి బరువునంతా తామే మోస్తున్నట్లు వ్యవహరిస్తుంటారు. ఆ విధంగా అతిగా వ్యవహరించి అనధికారుల మధ్య అప్పుడప్పుడు నలిగిపోతుంటారు.

'మన ప్రజాస్వామ్య వ్యవస్థకు మూల స్తంభాలయిన పార్లమెంటరీ, జుడిషియరీ, ఎగ్జిక్యూటివ్ వ్యవస్థలు మూడు తమ తమ పరిధుల్లో వ్యవహరించినపుడే అది విజయవంతమవుతుంది. అలా కాకుండా ఎవరు మైలు రాళ్ళలా వ్యవహరించినా ప్రజాస్వామ్య వ్యవస్థ సజావుగా నడవజాలదు. అందుచేత మైలురాళ్ళు, ఫర్లాంగురాళ్ళు అన్నీ సమానమేనన్న సత్యాన్ని అందరూ గుర్తించితే మన ప్రజాస్వామ్య వ్యవస్థ సజావుగా సాగుతుంది. ★

" సుభాషిణీ... దినకరూ... ఇద్దరేనా పిల్లలు... ? లేక "

" నో మోర్. నాలాంటివాడి ప్రాణాని కిద్దరు పిల్లలే లగ్జరి " అన్నాడు రామ చంద్రమూర్తి సాంబారు వేసుకుంటూ.

" ఇద్దరుండాలిలెండి. నాకూ యిద్దరే. అబ్బాయీ, అమ్మాయి. ఊఁ,.. ఈపాటికి సుభాషిణి అదుగో యిదుగో అని పెళ్ళీడు కొచ్చి ఉండాలే ? "




" తాకట్టు తాకట్టుకీ ఆడపిల్ల పెళ్ళీడుకీ రావడ మెంతసేపు ? రెండు మూడేళ్ళలో పెళ్ళి చెయ్యాలి. " భవిష్యత్తునీ భారాన్నీ తలుచుకుని కాబోలు కంఠం బరువెక్కింది.

" ఆడపిల్ల పెళ్ళంటే–అధమాధమం–పాతిక వేలన్నా పట్టుకోవాలి. పరిస్థితులంత చెడ్డగా ఉన్నాయి. అమ్మాయి సుఖపడాలంటే ఆ మాత్రం సంబంధమేనా చూడాలి. మరి ... పాతికవేలూ సిద్ధం చేస్తున్నారా ? " ఛిప్స్ నములుతూ అడిగాడు మధుమూర్తి.

" పాతికవేలు కాదు కదా,...పాతిక వందలయినా నిలవెయ్య గలిగే ఉద్యోగమేనా నాది ? నీ కంతా తెలుసుగా...."

" మరి ? సుభాషిణి పెళ్ళెలా చేద్దామనీ ? "

" ఇల్లమ్మేస్తాను. "

" తరువాత ? "

" దేముడిదే భారం. " పైకి చూశాడు.

" నిజంగా మీరు చాలా ఘనమయిన త్యాగాని కొడిగడుతున్నారు గురువుగారూ ! అమ్మాయి నొకింటిదాన్ని చేయడానికి మీరు రోడ్డున పడతారు భార్యా పుత్రులతో సహా. మీ నాన్నగారిచ్చిన యిల్లు ! .... కనీసం— సెంటిమెంటేనా...."

" మరేం చేసేది ? " నిస్సహాయుడి నన్నట్లు ముఖం పెట్టాడు.

" చేస్తారా ? "

" చేయగలిగేదయితే. "

" మీకు....సారీ గురువుగారూ యిలా చేదు నిజం చెప్పేస్తున్నందుకు....జీవితంలో ముందు జాగ్రత్త ఎంత తక్కువో మాటల్లో అంత ఎక్కువ. ఔనులెండి. కథా రచయితలు కదా ! "

" ఆ అధ్యాయం ఏనాడో ముగిసిపోయింది. "

" రేపెలాగూ మీ యింటికి వొచ్చి చూస్తాననుకోండి. అయినా ఆత్రత. దినకర్ ఎలా ఉన్నాడు ? నే నీ వూరు వదిలే నాటికి ఏడాది అబ్బాయి. నడక ప్రాక్టీసు చేసేవాడు. "

" రెండేళ్ళలో పెద్ద చదువుకి రాబోతాడు....నేను చదివిస్తే. "

"అంటే ? ఏ ఇంజనీరింగో, మెడిసినో చెప్పించరా?"

" అందరి—అన్ని కోరికలూ తీరుతాయా ? "

" మరి అతని భవిష్యత్తు....జీవితం ఏం కావాలి ? పెద్ద చదువులు చదివిన వాళ్ళే ఉద్యోగాలకి కటకటలాడి

పోతున్నారు. చదువు కూడా లేకపోతే ? మనమే అతన్ని పాడుచేసినట్లు కాదూ ? దినకర్ చురుకయిన వాడేనా ? ”

“ తండ్రిగా నేను పొగడ కూడదు. కాని.... చాలా చురుకయినవాడు. ”

“ మరి....అటువంటి వాడికి చదువు చెప్పించక....”

“ చెప్పించలేక....అదీ నిజం. ” సిగ్గుపడుతూనే అన్నాడు. “ అమ్మేందుకేమీ లేదు. అందుచేత—నేనేమీ చెయ్యలేను. ”

“ చెయ్యగలరు. మాస్టారూ ! జీవితమంటే అమ్మకాలు కావు. ప్రయోజకత్వమంటే—పెద్దలు వదిలిన ఆస్తిని కరారావుడి చెయ్యడం కాదు. దాన్ని పెంచడం. కాదంటారా ? ”

“ ఎలా అనగలను ? నాకు బుద్ధుంది. ” రామచంద్ర మూర్తికి కోపం వొచ్చింది. గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్లు తనకంటె చిన్నవాడు తనకి బాధ్యతల గురించీ బ్రతకడం గురించీ చెప్పడమా !

“ కోపం తెచ్చుకోకండి గురువుగారూ ! మీకు—పిల్లలంటే....”

“ ప్రాణం. ”

“ మీరు—చిన్న త్యాగం చేస్తే....కొంచెం శ్రమ తీసుకుంటే-వాళ్ళకి బంగారు భవిష్యత్తు లభిస్తుందంటే....” వాళ్ళకోసం ఏమయినా చెయ్యగలరా అన్నట్లు చూశాడు మధుమూర్తి.

“ అంతకంటే నాకేం కావాలి ? ”

“ ఊరికే కోరుకుంటే సరిపోతుందా ? కోరికలు నెరవేర్చుకుందుకు కృషి చేయాలి. లేకపోతే అవి గాలి మేడలే అవుతాయి. గాలిమేడలంటే గాలి మేడ్‌లే !

“మాస్టారూ! మీరు మంచికథలు రాసేవారు గుర్తుందా?”

“ ఎప్పటి మాటో అది.... ”

“ మీకు. కాని....నాకింకా అవి గుర్తున్నాయి.

జరిగినకథ

మంచిరోజు చూచి కొత్తగా నవల రాయటం మొదలుపెట్టాడు రామచంద్ర మూర్తి. తాను నవల వ్రాస్తున్నట్లు ఎవరితోను చెప్పవద్దని పిల్లలతోచెప్పాడు. నవలల మీద వాళ్ళ అభిప్రాయము విని విస్తుపోతాడు. అతనికి వచ్చిన 'ఐడియా' మొత్తం 300 పేజీలు÷రోజుకిరవై పేజీలు=15 రోజులు. ఈ ఆలోచనతో రామచంద్రమూర్తి హుంషారుగా కాగితాలకట్ట అందుకున్నాడు. పెన్ను సరిగ్గా రాయకపోతే దుశ్శకునం. కలాన్ని సిరాబుడ్డిలో ముంచి రాద్దామనుకుంటే సిరా ఒలికింది. తనతొలికథకూ ఇలాగే అయింది. అయినా అది అచ్చయింది. వెంటనే అతనికి పాతశిష్యుడు 'మధుమూర్తి' గుర్తుకు వచ్చాడు. అతను తిరిగి కనపడకపోతే ఈ 'నవల'కు శ్రీకారం చుట్టేవాడే కాదు. పని వేళా హోటల్‌కు పిలిపించి 'గురుదక్షిణ' అడిగాడు. గురువుగార్ని 'దక్షిణ' అడగడం ఏమిటంటే మీరివ్వగలిగిందే అన్నాడు. ఏమడుగుతాడో ఏమో

ఇక చదవండి

మీ కథలలో పాత్రలు సంపూర్ణంగా మనుషుల్లో ఉండేవి. వాస్తవంగా ప్రవర్తించేవి పేపర్‌మేడ్‌లా కాక. వాటి వెనుక రక్తమాంసాలూ, స్పందనా.... ఆవేశమూ.... ఉద్రేకమూ ... అర్థమూ.... అన్నీ ఉండేవి ”

“ అవన్నీ యిప్పుడెందుకులే. నేను మరిచిపోయాను. ”

## గురువు

" గురువు అమృతసరస్సు. గురూపదేశాన్ని మననం చేస్తే శిష్యుడి అజ్ఞానం పోతుంది. గురువును కలుసుకోవడంవలన బుద్ధి ఉదాత్త స్థితిని పొందుతుంది. మనస్సు నిర్మలమవుతుంది. సద్గురువు దర్శనంవలన అజ్ఞానతిమిరం తొలగిపోతుంది. అహంకారం నశిస్తుంది. సద్గురువు లభించిన వెంటనే సంశయాలన్నీ పటాపంచలవుతాయి. అమృతం స్రవిస్తుంది. గురువు ముత్యాలు వున్న సముద్రం. యోగులు హంసలలాగ వాటిని స్వీకరించి, గురువునే ఆశ్రయించుకొని వుంటారు. "

— గురునానక్

" అందుకే జ్ఞాపకం చెయ్యడం. మీరు కథలో పాత్రల మీద ఎంత శ్రద్ధ తీసుకునే వారో జీవితంలో మీ పాత్రల మీద అంత శ్రద్ధ చేసేశారు. కథని ఎంత పకడ్బందీగా నడిపేవారో బ్రతుకునంత నిర్లక్ష్యం చేసేశారు. వెరీ సారీ. క్షమించండి. నేను కాదీ పెద్దమాటలు మాట్లాడుతున్నది, నా హృదయం.

సుభాషిణి—అందమయిన....ధనవంతుడి కోసం.... కారుల్లో జీవితం కోసం....ఖరీదయిన కలలు కంటూ ఉంటుంది. దినకర్—ఇంజనీరో, డాక్టరో ఐ-యామ్మని దర్జాగా బతకాలని బంగారు కలలు కంటూంటాడు.

మీ శ్రీమతికూడా....నెలకొకటి కాకపోతేపోయే, ఏడాది కొకటైనా పట్టుచీర కొంటే బాగుండు నా దేవుడని మనసులో కోరుకుంటూనే ఉంటారు. "

" కలలకేం భాగ్యం ? కళ్ళు మూసుకోకుండా కూడా కనెయ్యొచ్చు. "

" నిజమే. కాని....కలలంటే ఏవి ? మనిషి..చిత్తశుద్ధితో ప్రయత్నించినా సాధించలేనివే కలలు. అంతే కాని- ఏ మాత్రమూ కష్టపడక....ప్రయత్నమయినా చెయ్యక.... ఆ కోరికలను కల లనేయడం న్యాయం కాదనడం అన్యాయం కాదనుకుంటాను. "

కోపంగా చూసి-పెరుగు పేసేసుకున్నాడు రామచంద్రమూర్తి.

" క్షమించండి. మీ పట్ల ఉండే అభిమానమే నాకింత తెగింపుని కలగజేస్తోంది. తండ్రిగా-మీరు వారి పట్ల మీ బాధ్యతను ఎంతవరకూ నిర్వర్తించారని ఆత్మపరిశీలన గావించుకోండి ఒక్కసారి. "

" మధుమూర్తీ ! " ఆగ్రహం పట్టలేకపోయాడు. " నన్నిలా అవమానించే అధికారం ఎక్కడిది నీకు ? ఎవరిచ్చారు ? "

" మీ పరిస్థితులు....మీతో ఆనాటి స్నేహం....మీ మీద అభిమానం...."

" సినిమా డైలాగులు....కథల్లో మాటలు.... " కసిగా అన్నాడు.

" మీరు కథలు రాసేవారు. మీ దగ్గర నా ఆటలూ మాటలూ సాగవు మరి. " " రైట్ ! ఇంక మీకు వాస్తవం చెబుతూ రెచ్చగొట్టడమనే కార్యక్రమానికి స్వస్తి చెప్పేస్తాను లెండి. ఉన్న మాటంటే ఎవరేనా ఉలిక్కి పడతారు. కొంచెం మెల్లగా భోజనం చెయ్యండి. నేనింకా యిప్పుడే రసం వేసుకుంటున్నాను. "

రామచంద్రమూర్తి అసంకల్పితంగానే ఆత్మపరిశీలన కావించుకోసాగాడు. మధు చెప్పేది నిజమేనా ? తను వాళ్ళ కలలనీ కోరికలనీ నిర్లక్ష్యం చేస్తున్నాడా ? తన బద్ధకంలో.... రోజులు గడిచిపోతున్నాయిలే అనుకుంటూ.... వాళ్ళ భవిష్యత్తు గురించి ఆలోచించడం మానేశాడా ? అయినా.... తనిప్పుడేంచేయగలడు ? అసలు

మధుమూర్తి ఉద్దేశమేమిటి ? ఇన్నాళ్ళయ్యాక కూడా తన గురించి....తన యింటి గురించి అతని కెలా తెలిసింది ? పాత మిత్రులు కలసి చెప్పేరా ? కావొచ్చు. ఇప్పటికేనా మించిపోయింది లేదు, మీరు తలుచుకుంటే యింటి పరిస్థితిని మార్చెయ్యగలరన్నట్లు మాట్లాడాడు అతను. నిజంగానా ? తానేమయినా చెయ్యగలడా తన భార్యా పిల్లల కోర్కెలు నిజం చేసేందుకు ? ఏమిటిది ?

* * *

"ప్రస్తుతం సాహితీ రాజ్యం తాలూకు సింహాసనం సీరియల్‌ది." అన్నాడు మధుమూర్తి గదిలోకి రాగానే రామచంద్రమూర్తికి సిగరెట్ యిస్తూ. తాంబూలాలు భోజనం ప్లేటు దగ్గరే యిచ్చాడు హోటల్‌వాడు.

రామచంద్రమూర్తి ఏమీ అనలేదు....అది తనకి ఆసక్తి కలిగించే విషయం కాదన్నట్లు.

"మీకు జ్ఞాపకం ఉందా....బహుమతి పొందిన నా నవల ?"

"సంయమనం....గుర్తుంది. వెయ్యినూట పదహార్లిచ్చారన్నారు."

"ఔను. ప్రథమ బహుమతే వెయ్యినూట పదహార్లు." నవ్వి

"ఇప్పుడు సీరియల్ కెంతిస్తారో తెలుసా ?" అడిగాడు.

"తెలియదు. నేను పత్రికలే చూడటం లేదు."

"ఆ విషయం తెలుస్తూనే ఉంది. పత్రికలు చూస్తూంటే కొంచెమయినా రాసేవారు. బార్ కెడితే తాగ బుద్ధి వేసినట్లు పత్రికలు చదువుతూంటే రాయ బుద్ధౌతుంది ఆ రంగంతో పరిచయమున్న మీవంటి వాళ్ళకి...."

"అలా కాదు. మరోలా జరిగింది."

"ఎలా ?"

"ఐదారేళ్ళవుతుంది....అప్పుడు కొన్నాళ్ళు పత్రికలు చదివాను. ముఖ్యంగా కథలు. అవి చదివాకనే నాకు కథలు రాయడమంటే మనసు విరిగిపోయింది"



"అంటే....చదివి చెడిపోయానంటారు !"

"నిజం చెప్పాలంటే—అంతే."

"ఏం ? ఆ కథలలా రాయలేమనిపించిందా మీకు ?"

"మరే." అతని కంఠంలో వ్యంగ్యం ధ్వనించింది. "అబద్ధమే గోడ కట్టినట్లుండాలన్నారు పూర్వులు. కథంటే కనీసం అందమయిన అబద్ధం. అది—మరీ వలలా ఉంటే ఎలా ? మూస కథలూ....మొదటి పేరాలోనే ముగింపు తెలిపోయే కథలూ....అలా రాయడం నా తరంకాదనిపించే...."

"పూర్తిగా అస్త్ర సన్యాసం చేసేశారు. పోన్లెండి. మీరు కథలు రాయొద్దు. ఎంతమంచి కథ రాసినా వంద రూపాయలే. ఆపైన—కథలు పొట్టి స్పేస్ ఫిల్లర్స్ (Space fillers) ఐపోయాయి యిప్పటి పత్రికలకు. కథలు రాయడంవల్ల కడుపూ నిండదు, కాలూ నిండదు.

పేరూ ఉండదు, ప్రతిష్టా ఉండదు. ఎలాగూ మానేశారు. కథలు రాయొద్దు."

"రాయలేను కూడా"

"నిజం?...." నమ్మలేనట్లు చూశాడు మధుమూర్తి. "మీరు—కథ రాయలేరూ నిజంగా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నిజంగానే. ఆ మధ్య ఎందుకో బుద్ధి పుట్టింది. కాగితాలూ కలమూ వేసుకుని కూర్చొన్నాను. ఎంత సేపటికీ ఆలోచనలే కాని....కాగితమ్మీద అక్షరంముక్క పెట్టలేకపోయాను. ఒకటీ, రెండూ కాదు....మూడు రోజులు! అంతే. దానితో నేనింక కథ రాయలేనని శాశ్వతంగా నిర్ణయించేసుకున్నాను."

"కంగ్రాట్యులేషన్స్ గురూగారూ! హార్టీ కంగ్రాట్యులేషన్స్...." ఆనందం పట్టలేనట్లు చేతులు పట్టుకుని ఊపేస్తూంటే రామచంద్రమూర్తి తెల్లబోయాడు. ఏమిటితను? దేనికి అభినందించాలో దేనికవసరం లేదో కూడా తెలియదా? ఈ మహారచయితకు అంత బొత్తిగా కామన్‌సెన్స్ లేదా?

"చాల్లే. దీనికంత ఆర్భాటమేమిటి?"

"మీకు తెలియదు. పాతయిల్లుని పడగొట్టి—కొత్తగా కట్టడం కంటె—కొత్త యింటిని కట్టడం సులభం.... తొందరగా ఔతుంది."

అతను ఆలోచనలో పడ్డాడు.

ఏమిటీ మధుమూర్తి?

మందు కొట్టకపోయినా—ఒకదానికీ ఒకదానికీ పొంతన లేకుండా మాట్లాడతాడేం? అప్పుడొకమాటా యిప్పుడొక మాటా సంబంధం లేకుండా. మాటలూ....ప్రవర్తనా అన్నీ చిత్రంగానే ఉన్నాయి. మెదడులో మరలు వొదులవలేదుకద రాసి రాసి?

"గురువు—శిష్యుడినుంచి ఏం కోరుకుంటాడు?" హఠాత్తుగా అడిగాడు.

"గురుదక్షిణ మాత్రం కాదు. శిష్యుడు తనకంటె చాలా గొప్పవాడు కావాలనీ....పైకి రావాలనీ....అలాగ. శిష్యాదిచ్ఛేత్ పరాజయం...."

"మీరు నానుంచి అలాగే కోరుకున్నారు కదా?"

"ఆహాఁ."

"మీ కోరిక నెరవేరిందా? నేను—మీ అంచనాలకు నిలబడగలిగేనా?"

"ఓఁ. నేనూహించనంత గొప్పవాడివీ పెద్దవాడివీ అయ్యావు."

"థాంక్స్. ఒక్కసారి మనం కొంచెం లాజికల్‌గా రీజనబుల్‌గా ఆలోచిద్దాం. నువ్వు నా వీపు గోకితే నేన్నీ వీపు గోకుతాననేది అలనాటి ఆంగ్ల నానుడి; నేటి—లోకం తీరు. ఔనా?"

"నిస్సందేహంగా."

"గురువుగారు శిష్యుడు తనకంటె గొప్పవాడు కావాలని కోరుకున్నట్లే—శిష్యుడుకూడా తన గురువుగారు...."

ఉలిక్కి పడ్డాడు. "అంటే....నేనిప్పుడు గొప్పవాణ్ణి కావాలా!"

"కావాలి మాష్టారూ. మీరు కాదని కాదు. కాని.... ప్రపంచానికి ఓసారి తెలియాలి. నలుగురూ మిమ్మల్ని పొగుడుతూంటే వారు మా గురువుగారే అని నేను సగర్వంగా చెప్పుకోవాలి. గురువు గొప్పతనాన్ని పంచుకుంటేనే శిష్యుడికీ గొప్ప...."

"ఇప్పుడు....నేనేం చెయ్యగలను? నీ కోసం ఐతే మాత్రం నేనెలా గొప్పవాణ్ణి కాగలను? అసలు—ప్రయత్నించీ గొప్పవాడు కావడం ఎలా?" అయోమయంగా చూశాడు మధుమూర్తివేపు. ఇతను—రాక రాక వొచ్చింది తన నెత్తిమీద బరువులు మోపడానికీ మనశ్శాంతి సుఖమూ కరువు చేయడానికీ కాదు కద?

"వెరీ సింపుల్. చాలా సులభం. ఒక్క దెబ్బకు మూడు పిట్టలు."

" ఏమిటి ? "

" సీరియల్ రాయండి. ఆరునెలలు సా....గే సీరియల్ రాయండి. మీకు—పేరు. ఐదువేలు పారితోషికం. నేనూ నలుగురికీ చెప్పుకుంటాను మా గురువుగారిదే యీ రచన అని. పబ్లిషర్ పుస్తకంగావేసి మరో ఐదువేలు. సినిమా సంగతి చెప్పలేంగానండి....."

" నేను— సీ రి య ల్ రాయడమా ! " నవ్వి.... " కథే రాయలేనే ! "

" కథ రాయడం మరచిపోయారు కనుకనే సీరియల్ రాయగలరు. నాకు నమ్మకం ఉంది. మీరు—బద్ధకం వదిలించుకుని....పట్టుదలగా ప్రయత్నిస్తే తప్పకుండా రాయగలరు. ఓ సీరియల్‌రాస్తే అధమాధమం పదివేలు. మూడు సీరియల్స్‌తో సుభాషిణి పెళ్ళి. రెండు సీరియల్స్‌తో దినకర్ చదువు. మరో సీరియల్‌తో మీ శ్రీమతిగారి కోర్కెలు....ఫటాఫట్. "

" ఆరు సీరియల్స్ !....నేను...." తల తిరిగినట్లయింది. మధుమూర్తి నవ్వాడు. " మొదటి సీరియలే మీరు రాస్తారు...."

" మిగిలినవి ? "

" అవి మిమ్మల్ని రాస్తాయి. అంటే—రాసేవరకూ మిమ్మల్ని రాసి రాపాడి రంపాన పెడతాయి. గురూజీ ! మీరు నాకు వాగ్దానం చేశారు మీ పిల్లల భవిష్యత్తు కోసం....కుటుంబ అభివృద్ధి కోసం.... ఏమయినా చేస్తాను చేయగలిగినదైతే అని." మరచి పోవద్దు సుమా అన్నట్లుందతని కంఠం.

" అది కాదు...." ఏదో అనబోయాడు రామచంద్ర మూర్తి.

" దయచేసి మీరు సాకులు వెదకకండి. మీరు రాయగలరు. నాకు తెలుసు. ఎందుకంటే—నేను పాత శిష్యుణ్ని స్నేహితుణ్ని. మీ సత్తా నన్నే పైకెత్తింది...."

" పెరటిచెట్టు మందుకి పనికిరాదని...."

మధుమూర్తి ఒక్కసారి సీరియస్ ఐపోయాడు. " మాస్టార్జీ ! నేనీవూరు రాగానే స్టేషన్‌లో మన ఫ్రెండ్ సుగుణ భూషణరావ్ కలిశాడు. మీ గురించి....ఎదగని మీ జీవితం గురించి చెప్పాడు. ఎలాగయినా—మీలో మార్పు....అభివృద్ధి తేవాలని కంకణం కట్టుకున్నాను. నాతో వచ్చిన డైరక్టరుని—హొంట్లో బాగులేదని లొకేషన్‌కి అతన్ని పంపేసి నేనుండిపోయింది మీ కోసమే. నిజమయిన స్నేహితుడు—తనవాళ్ళు తక్కువగా ఉంటే చూడలేడు, ఏదో అపత్రయ పడతాడు. మీరు యింకా ఆదర్శంగా ఉంటానంటే చెప్పలేను కానీ....ప్రస్తుతం—మనిషి విలువ డబ్బుతోనే ఉంది. సంపాదించిన వాడే గొప్పవాడు.

మీ చేతిలో కలం....ఐమీన్....రాయగల నేర్పుంది. దానిని మీరు వినియోగిస్తే—డబ్బు చేసుకోగలరు. సీరియల్‌కి పదివేలంటే....సుమారుగా మీ ఏడాది సంపాదన...."

" సాహిత్యాన్ని ఎంత వ్యాపారంగా చూస్తున్నావు!" భరించలేనట్లు అన్నాడు రామచంద్రమూర్తి.

" కళ కళకోసమే. కళ పవిత్రమైనది....వంటివి సినిమా డైలాగులూ సభల డైలాగులూ.. జీవితం డైలాగేమిటంటే—కళ కాసు కోసమని. " కచ్చితంగా చెబుతున్న మధుమూర్తి అతనికి కొత్త అవతారమెత్తినట్లు కనపడ్డాడు. " డబ్బు లేనివాళ్ళు పనికిమాలిన మాటలు చాలా చెబుతారు తమ అసమర్థతను వాటిచాటున దాచుకుందుకు. నమ్మకండి. లక్ష్మీ సరస్వతులంటాం కాని సరస్వతీ లక్ష్ములనం. అక్కడే ఉంది జీవితసూత్రం. సరస్వతీ కటాక్షంకంటె ముందు లక్ష్మీ కటాక్షమే అవసరమని. ధనవంతుడి జోక్‌కి నవ్వు లెక్కువ. "

కాదా అన్నట్లు రామచంద్రమూర్తివేపు చూశాడు.

అతనికి—కాదనే ధైర్యం లేకపోయింది.

ఆశ్చర్యంగానూ....శ్రద్ధగానూ వింటున్నాడు బుద్ధిగా.

" నన్ను తిట్టినా సరే....నేను గ్రహించిన చేదు నిజం చెప్పేస్తాను మీ సెంటిమెంట్లకు తగులుతుందని తెలిసినా. తగినంత డబ్బుంటేనే—భార్యకి భర్త.

తగినంత డబ్బుంటేనే—కొడుక్కి తండ్రి. డబ్బుంటేనే మనిషి. కర్రలేని వానిని గొడ్డె కరుస్తుందో కరవదోకాని కోరికలు తీర్చని మనిషిని యింట్లో వాళ్ళు నిత్యమూ కరుస్తారు."

నిజమే....అనిపించింది అతనికి.

"మీ సమస్యలు చాలావాటికి పరిష్కారం సీరియల్స్. గురూజీ! నేను మిమ్మల్ని రాళ్ళెత్తమనలేదు. గుళ్ళెత్త మనలేదు. రాయమంటున్నానంతే. మేక్ హే వైల్ సన్ షైన్స్....( Make hay while Sun shines ) సీరియల్స్‌కూడా ఎన్నాళ్ళు రాజ్య మేలతాయో చెప్పలేం. సందేహంగా ఉంది. కథ రాయగలిగినవాడికి సీరియల్ రాయడం సులభాతి సులభం.

కొండంతను-ఉండంతలో చెప్పడం కథయితే; ఉండంతను కొండంత చేయడం సీరియల్. లూజ్ టెక్నిక్...." అంటూ మధుమూర్తి విజృంభించేశాడు. ఉపన్యాసంలోకి దెంతేశాడు. నేటి సీరియల్స్....పత్రికలుచేసే తమాషాలు.... పాఠకుల అమాయకత్వం....ఏ సీరియల్‌కి ఎక్కువ పారితోషికం వొచ్చింది....క్వాలిటీ నెలా మరచిపోవాలి.... ఇంగ్లీషు నవలలనుంచి ఎలా కాపీ కొట్టాలి....యీ విషయాలన్నీటినీ అతనెంత చాతుర్యంగా చెప్పాడంటే---

"సీరియల్ రాయడం యింత సులభమా! యింత లాభదాయకమా! అయ్యో...ఇన్నాళ్ళూ నేనెందుకు సీరియల్ రాయలేదు? ఆరు సీరియల్స్‌తో జీవితాన్ని పేదరికంనుంచి ఫరవాలేనితనానికి పెంచుకోగలిగే అద్భుతావకాశాన్ని ఎందుకు చేజార్చుకున్నానిన్నాళ్ళూ?" అని విపరీతంగా పశ్చాత్తాపపడిపోయాడు రామచంద్రమూర్తి రిక్షాలో అర్ధరాత్రి యిల్లు చేరుకుంటూ. అంతేకాదు. అప్పుడే అతనొక ముఖ్యమయిన నిర్ణయం తీసేసుకున్నాడు కూడా! ఆరాత్రి కలలో ఆరు సీరియల్స్ రాసేశాడు.

(సశేషం)

# తార

## శ్రీరామ తత్త్వమెఱిగిన రమణి

తార వానరాంగన....శ్రీరామ తత్త్వ మెఱిగిన సుషేణుని కుమార్తె. కిష్కింధాధిపతియైన వాలి భార్య. మీదు మిక్కిలి వివేకవతి.

యుద్ధంలో వాలి చేత బాగా దెబ్బలు తిని పారిపోయిన సుగ్రీవుడు త్వరలోనే వచ్చి, నగరి వాకిట నిలిచి మళ్ళీ వాలిని యుద్ధానికి పిలిచాడు. సింహనాదము వంటి అతని కంఠస్వరం ( ధ్వని ) చెవుల పడగానే వాలికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. పళ్ళు పట పట కొరుకుతూ సుగ్రీవునితో యుద్ధానికి సన్నద్ధుడై వెడుతున్న వాలి మార్గానికి అడ్డుగా నిలిచింది తార.

ప్రేమగా, అనునయంగా అతనికి హితవు చెప్పదలచింది.

"ప్రవాహ వేగము వంటి నీ క్రోధాన్ని రాత్రి విడిచిన పువ్వులు ఉదయమున తీసివేసినట్లు విడిచిపెట్టుము, రేపటి ఉదయాన్నే యుద్ధానికి వెళ్ళవచ్చును. ఇప్పుడు వెళ్ళనందువల్ల నీకు గలిగే అగౌరవముగాని, అతనికి గలిగే గౌరవముగాని లేదు. నీ చేతిలో పరాజయం పొందినవాడు మళ్ళీ త్వరలోనే నిన్నెదుర్కొందుకు వచ్చాడంటే అది ఆలోచించవలసిన విషయమే.

ఈ పిలుపులో గల సంరంభం యిదివరకెన్నడూ వినలేదు. వెనుక యేదో బలమైన సహాయం వుండి వుండాలి. జన్మతః సుగ్రీవుడు తెలివైనవాడు, బుద్ధిమంతుడు, నిపుణుడు. అతడు అల్పుల సహాయం కోరడు.

ఇది కేవలం నా వూహ మాత్రమే కాదు సుమా! అందుకు కొంత ఆధారం కూడా కనబడుతోంది.

అయోధ్యాధిపతియైన దశరథ మహారాజు కుమారులు, ఇక్ష్వాకువంశ సంభవులు, ఆయిన శ్రీరామ లక్ష్మణులు నీ తమ్మునికి సహాయం చేసి ప్రియము చేకూర్చుటకు వచ్చి ఋష్యమూక పర్వతంమీద వున్నారని మన వేగు వలన అంగద కుమారుడు తెలుసుకున్నాడుట.

ఆ రాఘవులు అజేయులు, మహా పరాక్రమోపేతులు, సుగుణధాములు. అరుల పాలిట ప్రళయ కాలాగ్నివంటి వారు........ఆర్తులకు గతి....సాధువులకు చల్లని నీడ నిచ్చే వృక్షముల వంటివారు రామలక్ష్మణులు. విజ్ఞాన సంపన్నులు. తమ తండ్రిని సత్య సంధుని చేయుటకై అడవులకు వచ్చిన పితృవాక్య పరిపాలనా పరాయణుడు శ్రీరాముడు. ఆయన ననుసరించి వచ్చినవాడు లక్ష్మణుడు.

### వేదుల మీనాక్షీదేవి

సమస్త ధాతువులకు హిమాలయ పర్వతము నిలయము అయినట్లే సకల కల్యాణ గుణములకు శ్రీరాముడు నిలయము....అప్రమేయుడు....ఆ మహాత్మునితో విరోధ పడడం ఘోర తప్పిదం సుమా!" అని అంటూ ఇందు కుపాయం చెబుతానంటుంది తార.

"యౌవరాజ్యేన సుగ్రీవం / తూర్ణం సాధ్వభిషేచయ:
విగ్రహం మా కృథావీర / భ్రాత్రారాజన్బలీయసా
అహం హితే క్షమం మన్యే / తేన రామేణ
సౌహృదమ్
సుగ్రీవేణచ సంప్రీతిం / వైరముత్సృజ్య దూరతః
లాలనీ యోహితే భ్రాతా / యవీయానేష వానరః
తత్రవా సన్నిహస్తోవా / సర్వథా బంధు రేవతే
నహితేన సమం బంధుం / భువి పశ్యామి కంచన :
దాన మానాది సత్కారైః / కురుష్వ ప్రత్యనంతర
వైరమే తత్సముత్సృజ్య / తవ పార్శ్వేసతిష్ఠతు.

## మా పెంపకం

మా అవ్వ కూర్చిందె
మా మాట అందం ;

మా తాత తీర్చిందె
మా నడక చందం ;

మా అమ్మ పెంచిందె
మా మెంతు సహనం ;

మా నాన్న మలచిందె
మా నిండు హృదయం ;

మా ఇల్లు నేర్పిందె
మా మంచి సర్వం.

— కస్తూరి నరసింహమూర్తి

సుగ్రీవో విపుల గ్రీవ / స్తవ బంధు స్సదామతః
భ్రాతృ సౌహృదమాలంబం / నాన్యాగతి రిహా స్తితే,
యదితే మత్ప్రియం కార్యం / యదిచా వైషిమాహితాం.
యాచ్యమానః ప్రయత్నేన / సాధు వాక్యం కురుష్యమే. ”

సుగ్రీవునికి యౌవ రాజ్యాభిషేకం చెయ్యి ! అతడు బలవంతుడు. అట్టివానితో విరోధం తగదు. అతనిపై ద్వేషం విడిచిపెట్టు. అందువల్ల శ్రీరాముని ప్రేమకు నీవు పాత్రుడవౌతావు. ఆయన అందరకూ ఆశ్రయ మిచ్చేవాడు. ఆయనతో మిత్రత్వం సంపాదించు. నీ తమ్ముడూ సంతోషిస్తాడు. అతడు బహు బుద్ధిమంతుడు సుమా !

మన వాళ్ళందరిలో సుగ్రీవునితో సమానమైనవాడు ఒక్కడు కూడా లేడు ! అతడు నీ సోదరుడు. ‘ నా ’ అని చెప్పుకో తగ్గవాడు నీకు సుగ్రీవు డొక్కడు మాత్రమే సుమా ? అతని నాదరించి నీ దరిని చేర్చుకో. నీ ప్రక్కను కూర్చోబెట్టుకో. బహుమతులతోను, ఆదరముతోను అతనిని చేరువ చేసుకో. నా మాట యందు నమ్మకం వుంటే నా అభిప్రాయం ప్రకారం చెయ్యడం మంచిది.... నేను నీ మేలు కోరేదాన్ని.

ఇనతేజస్సమానుడైన శ్రీరామచంద్రునితో విరోధం వద్దు. అది నీకు ఖ్యాతి కరము కాదు. ”

అని పరి పరి విధాల హితమైన, క్షేమం కరమైన సలహా చెప్పింది తార ! యెంతటి యుక్తి యుక్తమగు సలహా అది ! !

తమ్ముని ఆదరించవలసిన విధి అన్నకు వుంది.

“ పితృ సమో జ్యేష్ఠః ” అన్న వాక్య ప్రమాణం ఆమె చెప్పింది !

ఊరకే ఆదరించడం కాదు. యువరాజుని చేయ మన్నది. అందువల్ల వాలి సుగ్రీవుని పట్ల చేసిన అపరాధం సమసిపోతుంది. శ్రీరామచంద్రు డానందిస్తాడు. అది తమపై అనుగ్రహం కాగలదు. త ద్వా రా ఆముష్మికమునకు హేతువు కాగలదు అన్నది.

ఎంతటి వివేకవతి తార !

అయితే రోగికి అపథ్యం రుచించినట్లు పథ్యం రుచించదు కదా ! ఆలాగే అంత్య కాలం సమీపించిన వాలికి తార హితబోధ నచ్చలేదు.

యుద్ధానికి వెళ్ళడానికే నిశ్చయించాడు వాలి.

“ మళ్ళీ నాతో యుద్ధానికి రాకుండా గట్టిగా బుద్ధి చెప్పి వస్తాను....చంపనులే....నాకు విజయము కోరి పంపించు ” అన్నాడు యుద్ధ సన్నద్ధుడైన వాలి.

ఇక చేసేది లేక తనతోడి స్త్రీలతో కలిసి దుఃఖంతో భర్తకు ప్రదక్షిణంచేసి, మంగళ వాక్యములు పలుకుతుంది తార.

తన భర్త చేసిన పని తప్పు. తమ్ముణ్ణి రాజ్యం నుండి వెళ్ళగొట్టాడు. అతని భార్యతో యెడబాటు కలిగించాడు.

సుగ్రీవుడు కొండలలో, కోనలలో తిరుగుతూ ; శీతవాతా తపాలతో బాధపడుతూ బ్రతుకు వెళ్ళదీస్తున్నాడు. అత డలాగ వుంటే వాలి హాయిగా రాజ్య భోగాల ననుభవిస్తూ వున్నాడు.

అందుకే శ్రీరామునికి తన భర్త అయిన వాలిపై కోపం అని గ్రహించింది తార. వాలికి ఆ గ్రహింపే లేదు !

తన కోపం తన తమ్ముని మీదే కదా ? ధర్మజ్ఞుడైన శ్రీరాముడు తననేమీ చెయ్యడు అనుకున్నాడు వాలి.

* * * *

శ్రీరాముని శరం వల్ల వాలి నేల కూలుతాడు.

వానర వీరులంతా దుఃఖిస్తూంటారు.

ఆ సమయంలో వాలి సుగ్రీవుని పిలిచి, అతనితో తారను గురించి చెబుతాడు.

" తార సుషేణుని కుమార్తె. సూక్ష్మములైన సంగతులను నిర్ణయించడంలో, సలహా చెప్పడంలో సమర్థురాలు. అపశకునాలనుబట్టి రాగల ప్రమాదములను తెలుసుకోగల జ్ఞాని ఆమె.

మంచిది. ఈ పని చెయ్యవచ్చును అని ఆమె చెప్పిన పని చేస్తూండు. ఆమె యిచ్చిన సలహాను తిరస్కరించినందుకే నాకీ గతి పట్టింది. " అంటాడు వాలి.

భర్తచేత అంతటి ప్రశంసలు పొందగలిగిన తార లోకజ్ఞత అసామాన్యము.

భర్తృ మరణం విన్న తార శోక విహ్వల మానస అయింది. రామబాణ నిహతుడై నేలపడి యున్న భర్తను చూచి మొదలు నరికిన వృక్షమును చుట్టుకున్న తీగవలె నేల కూలింది తార.

వారందరినీ చూచి శ్రీరాముడు కన్నీరు పెట్టుకుంటాడు.

పతి చెంత దుఃఖిస్తున్న తార కోదండపాణియైన శ్రీరాముని పదే పదే చూస్తుంది. తనతో ఆమె ఏమైనా చెప్పుకోదలచిందేమోనని తలచాడు శ్రీ రా ము డు. ఓదార్చుటకు ఆమెను సమీపించబోయాడు.

సహస్ర సూర్యుల కాంతితో ప్రకాశిస్తున్న పుండరీకాక్షుని, రాజ లక్షణ లక్షితుని, సాధు వేషధారిని, మున్నెన్నడూ చూడని, యోగ దృష్టినిగాని గాంచలేనట్టి పురుషోత్తముని చూసింది తార. ఇతడే తన పతిని ఒకే బాణంతో పడవేసిన శ్రీరామచంద్రుడై వుంటాడనుకుంది.

మంత్రులు ఆమెను వాలి వద్ద నుండి వేరు చేస్తారు.

తనవైపు వస్తున్న శ్రీరాముని చూచిన తార తానే ఆయనకు యెదురేగింది. తన భర్తను చంపినాడనే కోపంతో ఆయనపట్ల ఆగ్రహం కలిగింది. శాయశక్తులా దుర్భాషలాడ తలచింది. తీరా రామచంద్రుని చూడగానే ఆమె విశుద్ధసత్వ గనుక ఆమెలోని కాలుష్యం పోయి, సత్వగుణమే స్థిరపడింది. ఆయన మూర్తిలో పరమాత్మను చూడగలిగింది తారా మహా సాధ్వి !

శ్రీరాముని చూడకముందు ఆయన సామాన్య రాజ కుమారుడు కాడని గ్రహించింది. సప్త తాళ భంజనము, దుందుభి కళేబరము కాలి బొటనవ్రేలితో శతయోజనముల దూరము పడునట్లు మీటుట విని పరమాత్మ అంశం ఆయనలో వున్నదని తెలుసుకుంది. శ్రీ రాముని ప్రత్యక్షంగా చూచినప్పుడు ఆ తేజస్సు చూచి ఆయనే రామచంద్రుడై వుంటాడనుకుంది. ఆయనను సమీపించ డంతో ఆయన భగవత్స్వరూపమును గాంచి విభ్రాంతి చెందింది. అందువల్ల కలిగిన పవిత్ర భావంతో తన్మయురాలైంది. దుర్భాషలాడుటకు బదులు స్తుతించడం ప్రారంభించింది.

" త్వమప్రమేయశ్చ దురాసదశ్చ
జితేంద్రియశ్చోత్తమ ధార్మికశ్చ
అక్షయ్య కీర్తిశ్చ విచక్షణశ్చ
క్షితి క్షమావానేక్షతజోపమాక్షః
త్వమాత్త బాణాసన బాణపాణి
ర్మహా బలస్సంహననోప పన్నః

## పునాదిరాయి

"పునాదిరాయి మనకు ఆదర్శం. అది కంట కనపడదు. దానికి మెప్పు లేదు. అందంగా వుండకపోవచ్చు. నునుపుగా వుండకపోవచ్చు. అయినా అదే మూలాధారం. అది ఏమాత్రం కదిలినా కట్టడం మొత్తం కుప్పకూలిపోతుంది. సౌధం నేల మట్టమవుతుంది. శిఖరంకంటే, మరే ఇతర భాగంకంటే పునాదిరాయియే అతి ముఖ్యమైనది. అయినా ఆ రాయి తన ఉనికినే విస్మరించి, తనను కాదనుకొని, అక్కడే పడివుండి సేవచేస్తూఉంటుంది. తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తిస్తూ వుంటుంది. అట్టి భావనతోనే ప్రజాసేవచేయాలి. తాను వెలుగులోకి రావాలని, పైనే వుండాలని, నల్గురూ 'ఒహో' అనాలని, గొప్పగా పొగడాలని కోరుకోవడం వ్యక్తిలోని ఆంతరిక అల్పత్వాన్ని, స్వోత్కర్షను సూచిస్తుంది.

అయినా శిఖరాగ్రాన కూర్చోటంలో ఘనత ఏముంది? కాకి కూడా అక్కడ కూర్చోగలదు"

— యం. యస్. గోళ్వాల్కర్

మనుష్య దేహాభ్యుదయం విహాయ
దివ్యేన దేహాభ్యుదయేన యుక్తః"

నీవు అప్రమేయుడవు, అలభ్యుడవు, జితేంద్రియుడవు, ధార్మికోత్తముడవు అనంతమైన కీర్తి గలవాడవు. భూదేవి వంటి ఓర్పు గలవాడవు. గొప్ప శర, శరాసనములు ధరించిన వాడవు. మహా బలుడవు. దివ్య మంగళ విగ్రహుడవు, దేవతల అభ్యుదయము కొరకు, దుష్ట సంహారమునకై మానవ రూపం ధరించిన పరమాత్ముడవు" అని స్తుతిస్తుంది.

ఇక ; తన విషయం చెప్పుకోదలచింది.

"రామా ! నీవు అంతటివాడవైనా నా పతిని బ్రతికింపుమని కోరను. ఆయనకు నీ దయ వలన ఉత్తమ గతి కలుగుతుంది. నన్ను ఆయన వద్దకు పంపించు.

నా పతిని కొట్టిన బాణమునే నాపై ప్రయోగించి నన్ను అతని వద్దకు పంపు. స్త్రీ వధ పాపమని సందేహించకు. తాటక వధ చేసినవాడవు కాదా ? ( ఇందులో ఒక యెత్తిపొడుపు కూడా వుంది )

ధర్మ వచనములలో భార్య పురుషుని ఆత్మ అని తెలుస్తోంది. నేను వాలి ఆత్మను. భార్యా దానము మించిన దానము లేదని విజ్ఞులంటారు. నన్ను చంపడం వల్ల నీకు పాపం రాకపోగా పుణ్యమే కలుగుతుంది.

ఆర్తిలో వున్నదానను, అనాధను. నా పతి నన్ను వదిలిపోయినాడు. నా భర్తను విడిచి నేను బ్రతుకలేను" అని విలపిస్తుంది తార.

ఎంతో శాంతంగా ఆమె మాటలు వింటాడు శ్రీరాముడు. ఓదార్పుగా ఇలాగ అంటాడు—

"అమ్మా, నీవు శూరాగ్రేసరుని భార్యవు. ఇట్టి పేలతనం నీకు సహజము కాదు. లోకాలన్నీ విధాత సృష్టి. అలాగే సుఖ దుఃఖములు ఆ యా జీవుల కర్మానుసారం కలుగుతాయి ఆ విధాత వ్రాలు తప్పించడం యెటువంటివారికి తరం కాదు. నీవు వీర పత్నివి.... దుఃఖించకూడదు. నీ భర్త వీరులు పొందదగిన ఉత్తమ స్థానమును పొందాడు. ఇది ఆనందించవలసిన విషయం.

నీ కుమారుడు యువరాజు కాగలడు. నీవు సంతోషిస్తావు" అన్నాడు శ్రీరాముడు.

ఆమె యోగదృష్టిచేత శ్రీరాముడు విష్ణుని యవతారమని గ్రహించింది. అట్టి దివ్య పురుషుని చేతిలో వాలి మరణించడం పుణ్యం.

"వాలి ధన్యజీవి" అని తృప్తి పడింది తార. ●

# తాజ్‌మహల్ కాదు తేజోమహాలయము

"తాజ్‌మహల్ ఒక పేరెన్నికగన్న ముస్లింగోరీ కాదు; తేజోమహాలయము అనబడు పురాతన శివాలయము. మొగల్ చక్రవర్తి షాజహాన్ దీనిని జయపూర్ మహారాజా అనుమతి లేకుండానే స్వాధీన పరచుకొనెను. దీని గోడ వెలుపలి భాగంపై చెక్కబడియున్న పవిత్రము, రహస్యము అయినటువంటి హిందూ ప్రణవాక్షరము " ఓం "ను గమనిస్తే, ఇది ఆదిలో శివాలయమే అని ద్యోతక మవుతుంది." అని ప్రఖ్యాత చరిత్రకారుడు శ్రీ పి. యన్. ఓక్ 103 అంశములతో వివరించుతూ ఒక పుస్తకం ప్రచురించారు. వారు వివరించిన ప్రధాన అంశములను మాత్రం పాఠకులకు అందించు చున్నాను.

1. 'తాజ్‌మహల్' అను పదము మొగల్ న్యాయస్థానపు పత్రములలో ఎందును కానరాదు. 'మహల్' అనగా రాజభవనము అని అర్థము. ఒక స్మశాన వాటికకు ఈ పదము ఎట్లు వర్తించును.

2. 'ముంతాజ్‌మహల్' అను స్త్రీనుండి ఈ పదము వచ్చినట్లుగా చెబుతున్నారు. ఇది పూర్తిగా అవాస్తవికం. ఆంగ్లభాషలో తాజ్ (TAJ) అనుపదము J (జె)తో అంతమగును. అట్లే ముంతాజ్ (MUNTAZ) అను పదము జడ్ ( Z )తో అంతమగును. దీనినిబట్టి 'జె' తో అంతమగు తాజ్ (TAJ), 'జడ్' తో అంతమగు ముంతాజ్ (MUNTAZ) నుండి వచ్చుటకు వీలులేదు.

3. 'తాజ్' మరియు 'మహల్' అను పదములు సంస్కృతమునుండి ఉత్పన్నమైనవి. మొగల్ రికార్డులలో "ముంతాజ్‌మహల్" అను పదము లేనేలేదు. ఆఫ్గనిస్థానమునుండి అబిసీనియా వరకుగల ఏ ముస్లిం రాజ్యములోను "మహల్" అని వివరించబడిన భవనము లేదు.

4. 'తాజ్‌మహల్' అనుపదము "తేజోమహాలయము" అను సంస్కృత పదమును చెడిచిన రూపము. ఈ తేజోమహాలయములో " అగ్రేశ్వర్ మహదేవ్ " ( ఆగ్రా ప్రభువగు భగవంతుడు) ప్రతిష్ఠించబడినాడు.

5. " విశ్వకర్మవాస్తుశాస్త్రము " అను ప్రఖ్యాతవాస్తు గ్రంథంలో చెప్పబడిన శివలింగములలో "తేజలింగము" ఒకటిగా చెప్పబడినది.

6. ఆగ్రా ప్రాంతంలో నివసించే 'జాట్' తెగవారు శివుణ్ణి "తేజాజీ" అని పిలుస్తారు. వారు ఆలయములను 'తేజామందిరములు' అంటారు. దీనినిబట్టి తాజ్‌మహల్, తేజోమహాలయమని భావించవచ్చును.

7. ఈ మధ్యనే లక్నో వస్తుప్రదర్శనశాలలో ఒక శిలాశాసనం భద్రపరచబడింది. ఈ శిలాశాసనము తాజ్‌మహల్‌నుంచి 36 మైళ్ళ వ్యాసమునకు లోపలే కనుగొనబడింది. ఇది క్రీ. శ. 1155 నాటిది. దీనివలన తాజ్‌మహల్ కనీసం షాజహాన్‌కు పూర్వం 500 సం. క్రితం కట్టబడినట్లుగ తెలుస్తున్నది.

8. తాజ్‌భవన సముదాయమును తన కిమ్మనుమూ 18-12-1633లో షాజహాన్ పంపిన రెండు ఉత్తరువులను మాజీ జయపూర్ మహారాజా తన స్వంత రహస్యపు భద్రతలో నుంచుకొనెను. బలాత్కారముగ ఈ భవన సముదాయమును షాజ్‌హాన్ లాగుకొనినట్లుగ తెలుస్తున్నది.

9. చలువరాతి తాజ్‌మహల్‌ను షాజహాన్ కట్టించలేదు సరిగదా, నల్లటి అక్షరములతో దాని రూపు చరచెనని

## సృజన శ

దీపం ముట్టించు
చీకటి రాక్షసిని తుదముట్టించు
సంచలనం దట్టించు
రవి కాంతులనే రప్పించు
భువిలో క్రాంతిని తెప్పించు !

అడవి ఘోషలో
ఆడలెత్తిన నీ హృదయం
నందనవనం నవ్వులో వనలెత్తాలి
సమస్త ప్రకృతి
నవయుగ చైతన్య తరంగితమై
అంతరంగ అరవిందాలనే
నవనవోన్మీలనం చెయ్యాలి !

జనత అడుగు అడుగునా
సద్ధర్మ్య సృజన శక్తి
ఉన్ముద్రం కావాలి !

— ఆచార్య భావన్

భవనముయొక్క శిలాశాసనము చెక్కిన అమానత్ ఖాన్ షిరాజీయే శాసనములో ఉల్లేఖించాడు.

10. ప్రఖ్యాత ప్రాశ్చాత్యవాస్తుశాస్త్ర నిపుణులు ఇ. బి. హావెల్, శ్రీమతి కె. నోయర్, సర్ డబ్ల్యు. డబ్ల్యు. హంటర్లు తాజ్‌మహల్ హిందూదేవాలయ పద్ధతిలో కట్టబడినదన్నారు. జవాలోని చండి దేవాలయంయొక్క భూపటము (Ground plan) తాజ్‌భూపటము ఒకే విధంగా వున్నాయని 'హావెల్' అన్నాడు.

11. అష్టకోణాకారముగల తాజ్‌మహల్‌కు ఒక ప్రత్యేక హిందూ ప్రాముఖ్యత కలదు. ఏలయన హిందువులు మాత్రమే ఎనిమిది దిశలకు ఎనిమిది పేర్లు, ప్రతి దిశకు ఒక దిక్పాలుని కలిగియున్నారు.

12. గుమ్మటపు ఆకారముగల శిఖరము పైభాగము త్రిశూలము కలదు. తాజ్‌కు తూర్పుననున్న ఎర్రరాతి ముంగిలిలో (రాజసభ జరుగుచోటు) ఒక పెద్ద త్రిశూల శిఖరము నిలబెట్టబడియున్నది. త్రిశూలము మధ్యగల ఈ పెవంటి కూచిభాగమునకు బదులు, కలశాకృతి, దీనిలోనుండి వంగినట్లున్న రెండు మామిడాకులు, కలశముపై టెంకాయ చిత్రించబడియున్నది. ఇది హిందువుల పవిత్ర చిహ్నం.

ఈ పుస్తక రచయిత శ్రీ పి. యన్. ఓక్ యింకా అనేక దృష్టాంతరములను వివరించారు. ఆ పుస్తకం చదివిన వారికి తాజ్‌మహల్ తప్పనిసరిగా ఒక శివాలయమే ననే భావన కలుగుతుంది. ఇంకా యితర వివరాలకు పుస్తకం చదువదలచినవారు ఈ క్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

శ్రీ టి. వి. శ్రీనివాసరావు, అడ్వొకేట్
6/5 రామారావువీధి, కడప

— సంపాదకుడు

" చేతలను బట్టి ఒక వ్యక్తి శీలమును నిర్ణయించాలిగాని, అతని వేషధారణను బట్టి కాదు "

— స్వామి వివేకానంద

# ఆదిభట్లవారి చమత్కార వచోవైభవం

సంగీత సాహిత్య కళానిధి శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు. ఆంధ్ర దేశమున అంతంత మాత్రముగా యున్న హరికథా ప్రక్రియను ఒక మహోన్నత స్థితికి తెచ్చిన మహనుభావులలో దాసుగారు అగ్రగణ్యులు. వీరు రక్తాక్షినామ సం॥ర శ్రావణ కృష్ణ చతుర్థశి ( 31-8-1864 ) నాడు నరసమాంబ, వేంకటాచయనులకు జన్మించిరి. వీరు ద్రావిడ శాఖీయులైన బ్రాహ్మలు. సౌరాష్ట్రము నుండి వీరి పూర్వులు ఆంధ్ర దేశమున గల " అజ్జాడ " అను గ్రామమునకు వచ్చిరి.

## కందాళ వేంకట నరసింహాచార్య

నారాయణదాసుగారి జీవితం అనేక విశేషములకు నిలయం. వీరు సంగీత-సాహిత్యములందు దిట్ట. విజయనగరం గజపతివారి సంగీత కళాశాలలో చాలాకాలము ప్రిన్సిపాల్‌గా పనిచేసిరి. అనేక హరికథలను గ్రంథములను రచించారు, అనువదించారు. అనేక సత్కారముల, సన్మానములను పొందారు. వీరు హరికథకు చేసిన సేవకు తార్కాణము వారికి గల " హరికథా పితామహ " బిరుదమే. దాసుగారు సున్నితమైన హాస్యమును హరికథల యందు, మాటల సందర్భములలో చిలికించుట యందు ఎంతో నేర్పరి. ఈ వ్యాసమున " స్థాలీ పులాక న్యాయము"గా దాసుగారి చమత్కార వచో వైభవమును చూతము.

దాసుగారికి వివిధ సంస్థానముల యందు హరికథా గానము చేయుట పరిపాటి. అదే విధముగా ఒకసారి విజయనగరము సంస్థానమున హరికథ చెప్పుటకు ఉపక్రమించారట. అయితే కథ వినుటకు టికెట్టు కొన్నవారికి మాత్రమే పరిమితము. దాసుగారు హరిశ్చంద్రోపాఖ్యానము చెప్పుచు నక్షత్రకుడు హరిశ్చంద్రుని అమ్మ జూపుచూ పాడే పాట " చాల— చవుక బేర–మిదియే జుండిసరగున జనులార కొనరండీ. " అని పాడుచుండగ తన మిత్రుడగు సర్కిల్ ఇన్స్‌పెక్టర్ గారు లోని కప్పుడే వచ్చుచుండుట గమనించి " చాల గొప్ప బేరగాడే వచ్చె"నని అతనిని చూపుచు అనేసరికి సభ అంతా గొల్లుమని నవ్వారట. ఆది సందర్భ శుద్ధి గలవారు మాత్రమే చేయగల హాస్యము. అలా చేయటం అందరికి చేతనయ్యే పని కాదు.

నారాయణదాసుగారు కథా గానం చేస్తూ చేసిన పర్యటనల మూలంగా అనేకమంది మిత్రులను సంపాదించారు. అందుచే ఆ కాలమున దాసుగారి పేరు తెలియని వారు లేకుండిరి. ఒకానొక సందర్భములో దాసుగారు శ్రీ కొమ్మిరెడ్డి సూర్యనారాయణ నాయుడు గారితో ' లోకాభిరామాయణం ' ( కబుర్లు ) మాట్లాడు చుండిరి. మాటల సందర్భంలో సంగీత విషయం కూడా వచ్చినట్లుంది. అపుడు నాయుడుగారు " అయ్యా ! దాస కవీంద్ర మన ఆంధ్ర గాయకులు దక్షిణ దేశము బోయి సంగీతము నభ్యసించి తమిళ గాయకుల వలె పాడవలె " నని పలికెను. సహజంగా ప్రతి మనిషికి పొరుగింటి పుల్లకూర రుచి అన్నట్లే నాయుడు పలికాడు. దాసుగారు వెంటనే చమత్కారముగా దెబ్బకొట్టవలయునని తలంచి "అయ్యా ! సూర్యనారాయణగారూ ! ఎవడైన తనకు పుట్టిన కుమారుని బడే సాహెబులాగా ఉండవలెనని కోరుకొనునా ? " అని పలికిరట. ఆ మాట విని నాయుడుగారు నోరు మెదప లేదుట.

ఆదిభట్లవారు చిన్న చిన్న మాటలలో అనంతార్థముల స్ఫురింపచేసి హాస్యము చిందించుటయందు నేర్పరి. ఒకసారి వేసవి కాలములో విజయనగర సంస్థానాధీశుడగు

శ్రీ తిలక్ నారాయణ గజపతి దాస కవీంద్రుని ఉదక మండలమునకు తీసుకొని పోయిరట. దాసుగారు చెంత ఉంటే చింతలకు తావు ఉండదనే ఉద్దేశ్యముతో కాబోలు. అచ్చట ఒకనాడు సదరు రాజాగారు దాసుగారిని మోటారులో ఎక్కించుకొని స్వయముగా నడుపుచూ, నెత్తు పల్లములు గల మార్గముపై అతి వేగముగా పోనిచ్చుచుండుట దాసుగారు గని "మహాప్రభో! దయచేసి కొంచెము నెమ్మదిగా నడుపుడ"ని కోరిరి. అందులకు మహారాజు "నేనే స్వయముగా నడుపుచుండగా భయమెందులకు" అని పలికిరట. అందులకు దాసుగారు "అందులకే—అందులకే" అనిరట. ఆ మాటలకు రాజుగారు నవ్వుకొని డ్రైవరును నడుపుమని అజ్ఞాపించి దాసుగారి ప్రక్కన చేరారట.

ఒకసారి దాసుగారు కాకినాడ గాన సభలో హరికథా కాలక్షేపము చేయుచుండిరట. జనము క్రిక్కిరిసి యుండుటచే అప్పుడొక జమీందారు అచ్చట కూర్చున్న జనమును త్రోసుకొని వచ్చి ముందు కూర్చుండి, కొంతసేపు వుండి మరల లేచిపోయెనట. అది చూచిన దాస కవీంద్రులు "పుట్టిన తోడనే గిట్టినట్టు తానీ లోకమునకు ఎందులకు వచ్చెనో యిందుండి ఏమి అనుభవించిపోయెనో ఆ దేవునికే తెలియు" నని అతనికేసి చూపుతూ కథా సందర్భమున అనగానే సభాసదులు కడుపుబ్బా నవ్విరట.

దాసుగారు వ్యంగ్యముగా రెండర్థములు స్ఫురించునట్లు మాట్లాడుట యందు సిద్ధహస్తులు. ఒకసారి నారాయణ దాసుగారు బాపట్లలో హరికథ చెప్పి ముగించిన సందర్భములో, ఆ నగర న్యాయమూర్తి దాసుగారిని ప్రజల పక్షమున సత్కరిస్తూ...."మహా కవీంద్రా! మీ జననీ జనకుల ఆశీర్వాద బలమెట్టిదో కాని యింత వృద్ధాప్యములో కూడా వర్ణనాతీతముగా నాడుచు, పాడుచు, నాలుగు గంటల కాలక్షేప మొనరించుటకు కావలసిన బలము కలిగి యున్నారు కదా!" అని అనగా; దాసుగారు ఒక చిరుదరహాసమును విసురుతూ "నా బాల్యదశ యందు స్వేచ్ఛా విహారమును జేయకున్న నింతకన్న బలశాలినై యుండెడి వాడినే" యని అనగానే అందులోని వ్యంగ్యాన్ని గ్రహించిన శ్రోతలు పక్కుమన్నారట.

ఒక పర్యాయము ఒకానొక కవిగారు దాసు కవిగారిని గూర్చి ప్రశంసా పూర్వకముగా పద్యములను వ్రాసి పంపించిరట—అందులో ఒక పద్యరాజము నందు, దాసుగారు భాషా పాండిత్యమున అనంతుడనియు, నాట్య శాస్త్రమున భరతుడనియు, సంగీతంలో త్యాగరాజని ప్రశంసించెను. అది విని దాసుగారు నవ్వుచు "ఆరు మాసములు సాముచేసి అడదాని మీదకు యుద్ధమునకు పోయినట్లుగా నుంది, మర్త్య రూపమున ఉన్న గంధర్వు

## పేదలపట్ల – దీనదయాళ్

గాంధీజీ వలెనే దీనదయాళ్ నిరాడంబర వ్యక్తి. శ్రమలో గౌరవాన్ని గుర్తించిన వ్యక్తి. తన రూపురేఖలు ఎలా ఉన్నాయో తన దుస్తులు ఎలా ఉన్నాయో ఆయన ఎన్నడూ పట్టించుకొనే వారు కారు. ఒకసారి చుట్టుప్రక్కల ఉన్న మంగలి షాపులలో ఎక్కడా ఖాళీ లేకపోవడంతో ఆయన రోడ్డు ప్రక్కన కూర్చొన్న మంగలిచేత క్షవరం చేయించుకున్నారు. అడ్డదిడ్డంగా వున్న ఆ క్రాపు చూసి మిత్రులంతా హేళనగా పగలబడి నవ్వారు. ఆయన ఏ మాత్రం తొణకకుండా "నాకు తీరికా లేదు. పాపమా రోడ్డుమీది మంగలికి ఖాతాదారుడూ లేడు" అని జవాబు చెప్పారు.

## నవకవితా కల్పవల్లి !

రా తల్లీ
నవకవితా కల్పవల్లీ
పరిమళ సంభరిత మల్లీ !
శరత్కాల పూర్ణిమా శశి కిరణంలా
చరణమంజుల కింకిణీ క్వణత్ చరణం లా
నా యెదలో మెదిలిన
కోయిల కంఠంగా
నా కరమున కదిలిన
క్రొమ్మెన గంటం గా
వెలువడుము
విశ్వవ్యాప్తంగా !

— పఙ్ఘల కాళిదాసు

డగు నన్ను త్యాగరాజుతో పోల్చినాడేమి ? ” యనగా ఎల్లరు నవ్విరట.

మనిషికి ఒక అలవాటు ఉన్నట్లయిన అది ఏ ప్రదేశమునకు పోయినను మానుకొనడని నిరూపించుటకు దాసుగారు ఒక ప్రభుత్వ గుమాస్తాకు సంబంధించిన ‘ చిత్రకథ’ను ఒకటి ఒక హరికథలో చెప్పారు. అది ఏలూరులో దాసుగారు కథ చెప్పుచుండగా ఒక ప్రభుత్వోద్యోగి వచ్చి కూర్చుని ప్రక్క ఉద్యోగితో ఆఫీసు విషయాలు మాట్లాడుచున్నాడట. దాసుగారు వారిని గమనించి ఆ సందర్భమున అలవాట్లను గూర్చి చెపుతూ “ ఒక ప్రభుత్వోద్యోగికి పుట్టింట వున్న భార్య లేఖ వ్రాసి చివర నోటు వ్రాసినట్లుగా “ ఒక్కసారి తప్పక యిచ్చుటకు వచ్చి పోవలసింది. ” అని రెండు మార్లు వ్రాసి ముగించి పోస్టులో వేసేనట.

తర్వాత ఒకరోజు ఆ ఉద్యోగి ఆఫీసుకు సంబంధించిన లేఖలకు తగిన ఉత్తర్వులను క్రింది అధికారులకు పంపుచూ, భార్య వ్రాసిన ఉత్తరమును కూడా చదివి యందు చివర వ్రాసిన పంక్తులు “ మీరు దప్పక యిచ్చుటకు వచ్చి చూచి పోవలసినది ” యను దాని క్రింద గీత గీచి “ దీనిపై తగిన చర్య తీసుకోవలయునని ” క్రింది అధికారికి వ్రాసి పంపెను. అది క్రింది అధికారి చూచి నవ్వుకొని “ వారికి భార్య రమ్మని ఉత్తరము వ్రాసిన నన్ను పోయి చర్య దీసికొనుమని యనుట ఆశ్చర్యముగా యున్నదని ” భావించి ఆ అధికారికి ఆ విషయము చెప్పి లేఖను చూపెను. అప్పుడా అధికారి దానిని తీసుకొని చదువుకొని సిగ్గు పడెను. ” అని దాసుగారు చమత్కరించగానే ప్రేక్షకులు గొల్లుమని నవ్విరట. అంతటితో ఆ యధికారి సిగ్గుతో తల వంచుకొని మరల మాట్లాడక కథా శ్రవణా సక్తుడయ్యెనట. ఈ విధముగా దాసుగారి జీవితమున ఎన్నో చమత్కారముల పండించినారు.

ఈ విధముగా నారాయణదాసు తన జీవితమును సర్వ విషయ కదంబము అయిన హరికథలాగా గడిపారు. అతని దేహం సర్వ కళలకు నిలయం. ఇలా ఒక వంక హాస్యము చిందిస్తూ, కవిత్వము చెపుతూ, హరికథా గానామృతమును పంచుతూ తనే సరస్వతీమూర్తియై సహస్ర మాసముల నిండు జీవితమును గడిపి 2-1-1945 నాడు వారెల్లప్పుడు కోరుకొనే హరిపాద సన్నిధియగు వైకుంఠమును చేరుకున్నారు. 

“ విద్యార్థి జీవితము విలాసయుతముగ నుండుటకంటే సామాన్యముగా నుండుటే మంచిది. ”

— మహాత్మాగాంధీ

# పుత్తడిబొమ్మా పూర్ణమ్మా!

ఈ రోజుల్లో తెల్లవారిలేచి ఏ పేపర్లో చూసినా, ఎక్కడే వార్తలు విన్నా ప్రమాదాలూ, చావులూనూ. అందులోనూ ఆడవాళ్ళకు సంబంధించిన మరణాల్లో చాలాభాగం మానభంగాలూ, హత్యలూ, ఆత్మహత్యలూ, కోడలు కట్నం తేలేదని అత్తమామలామెను చంపేరనో, భర్త పెట్టేబాధ భరింపలేకో, అత్తమామల పోరుపడలేకో అతివల ఆత్మహత్య అనో ప్రధానంగా వినిపిస్తున్నాయి. మానవుడు వైజ్ఞానికంగా ప్రపంచదేశాల్తో పోటీపడి అగ్రగామి అవుతున్న రోజుల్లోకూడా ఈ పైశాచిక కృత్యాలు మానడంలేదు. కారణం_సంఘంలో మహావృక్షంగా ఊడలువేసిన 'వరకట్నం' దురాచారం. ఇది ఎప్పుడో ఒకప్పుడు కూకటి వ్రేళ్ళతో కూలకతప్పదు. కానీ_అంతవరకూ అతివల బ్రతుకులు ఇంతేనా! ఇదీ_ఈనాటి పరిస్థితి.

ఈ శతాబ్దం ప్రారంభానికిపోతే_ఇదే సంఘంలో మరో దురాచారం మహావృక్షంగా వ్రేళ్ళూతన్ని వ్యాపించింది. అదీ ఒకవిధంగా మహిళల పాలిట 'మహామారి' గా వుండేది. అదే 'కన్యాశుల్కం'. ఈ దురాచానికి బలైపోయిన ముక్కుపచ్చలారని ఎంతమంది స్త్రీలు 'కన్నెలుగానే' విధవలయేరో! ఎక్కడో వితంతు వివాహాల సంస్కరణగా కందుకూరి వంటివారు స్త్రీకి పునర్వివాహం చేసేరన్నా దాని శాతం చాలా తక్కువేగదా?

ఒక్కసారి కాలానికి వెనక్కువెళ్ళి నాటి దురాచారం లోంచి మహాకవి గురజాడ పూర్ణమ్మ తత్త్వదర్శనం చేద్దాం. (గురుజాడ "పూర్ణమ" అని వ్రాసినట్లువుంది)

అది 19వ శతాబ్దపు చివరి దశాబ్దం. విజయనగర ప్రభువులు ఆనంద గజపతి మహారాజా కన్యాశుల్క దురాచారాన్ని అరికట్టడంకోసం మద్రాస్ కౌన్సిల్లో ప్రయత్నించి కృతకృత్యులు కాలేకపోయారు. అంతకుముందుగానే ఈ దురాచారానికి బలైపోయినవారి "పరిగణన" తీసుకున్నారు. మన మహాకవి ఇచ్చిన లెక్కల ప్రకారం అప్పటి మూడు సంవత్సరాలలో జరిగిన వివాహాల్లో ఐదేండ్ల పిల్లలకు 99, నాలుగేండ్ల పిల్లలకు 44, మూడేండ్ల పిల్లలకు 36, రెండేండ్ల వారికి 8, సంవత్సరం పిల్లలకు 3 ఇంతకంటే దారుణం ఏమిటంటే_కడుపులోవున్న పిల్లల్ని సైతం అమ్ముకోవడం .. (పుట్టబోయేది ఆడపిల్ల అయితే పెళ్ళి కాకపోతే అంతే అడ్వాన్సు తిరిగి యివ్వబడదు) మహారాజావారి ఈ సేకరణే _ మహాకవి కన్యాశుల్కానికి ప్రేరణ. 1892 ఆగస్టులో కన్యాశుల్క నాటకం ప్రదర్శన కూడా అయింది రాజావారి సమక్షంలో కోటలోనే.

డా॥ అయలసోమయాజుల గోపాలరావు

పూర్ణమ్మ రచనాకాలం "కన్యాశుల్కం" రచన తరవాతే కానీ సరియైన సంవత్సరం తెలియదు. ఎమెస్కో వారి "ముత్యాలసరాలు" లో పూర్ణమ్మ గేయం ఫుట్‌నోట్‌లో "రచనాకాలం తెలియదు. శ్రీ గురజాడ రామదాసు పంతులు ప్రకటించిన (1929) అప్పారావు రచనలలో ఈ పాటకు సాధారణ శీర్షికగా 'ఆడపిల్లల పాటలు' అనేమాట కనిపిస్తూంది" అనివుంది. శ్రీ సెట్టి ఈశ్వరరావు పరిష్కర్తగా ప్రచురించిన గురజాడ కవితల సంపుటంలోకూడా 'పూర్ణమ్మ' ప్రచురణ మొదట ఎప్పుడు జరిగిందో తెలియదు' అనే వున్నది. కానీ సామాన్యంగా చూస్తే ముత్యాలసరాల కవితలు 1910_1915 మధ్య ప్రాంతానివని అనుకోవచ్చు. అంటే నాటకరచన అయేకే వీటి రచన. అంత పెద్ద నాటకంలో భాషా సంస్కరణతో పాటు ఏ సాంఘిక దురాచారాన్ని ఎత్తిచూపేడో అదే విషయాన్ని చిన్న పూర్ణమ్మ ఖండికలో సూత్రించేడు. అందుకే ముందుది భాష్యం తరువాతది సూత్రం. ఇదో కా ...

'కన్యాశుల్కం' వల్ల ఏమి సాధించేదో అంతకుమించి "పూర్ణమ్మ" వల్ల అతనికి లభించింది. ఒక పూర్ణమ్మ గేయం చాలు గురజాడను సంఘ సంస్కర్తగా నిలి పేందుకు. సాహితీ సామ్రాజ్యానికి "పట్టం" కట్టేందుకు. "అల్పాక్షరముల అనల్పార్థము" అంటే ఇదే!

"పూర్ణమ్మ"లో కథావస్తువు అత్యల్పం. కవితా శిల్పం అనల్పం. అందుకే ముత్యాలసరానికి నాయక మణి పూర్ణమ్మ!

రసభరితమైన వాక్యమే కావ్యమనీ-దానికి జీవం ధ్వని అనీ- అన్నారు ఆలంకారికులు. శృంగార మొక్కటే రస మని ఒకరంటే, కాదు కరుణరసమొక్కటే రసమన్నాడు మరో మహానుభావుడు. గురజాడ కరుణరస ప్రధానంగా సహృదయులను కదిలించాడు పూర్ణమ్మద్వారా. కథా కథ నంతోపాటు - రసపోషణంతోపాటు - పద ప్రయోగ వైచిత్రిని ప్రదర్శించి కావ్య జీవితాన్ని ధ్వనింపజేశాడు.

అసలు కథాప్రారంభమే ఒక ఉత్కంఠతో పఠితల్ని ఆకర్షిస్తుంది.

మేలిమి బంగరు మెలతల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా
తల్లులగన్నా పిల్లల్లారా
విన్నారమ్మా యీ కథను,
ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
అమ్మలకన్నా అమ్మల్లారా
వినరమ్మా మీరీ కథను - అంటూ

తొందరగా పోతున్న మనిషిని ఏందోయ్ ఇది విన్నావా! అంటే తక్కున ఆగిపోయి, ఏంచేంటి? అంటూ ఉత్సుకత చూపిస్తాడు. అంతకుమించిన ఆసక్తిని రేపుతుంది ఈ ప్రారంభం. శ్రోతలుగా ఎవరెవర్ని పిలుస్తు న్నాడో చూడండి. మేలిమిబంగరు మెలతలు కలువల కన్నుల కాంతలు,-అమ్మలగన్న-అమ్మలు, కథలో పాత్రలూ వాళ్ళే! విన్నారమ్మా, వినరమ్మా యీ కథను అనడంలో ఏదో జరుగకూడనిది జరిగిపోయినట్లుగా కాబట్టే "వినండి" అంటున్నాడు.

తరువాత వస్తు నిర్దేశం. సినిమాలో కెమేరా అలా చుట్టూ తిపిన్నట్లుగా-దూరంగా కొండలు-ఆ కొండల మధ్య ఓకోన. దాని నడుమ ఓ కొలను, కొలనుగట్టున కోవెల, లోపల దుర్గమ్మ-ఇదో డైరెక్షన్. ఏంగిల్ మార్చేడు, ఆ కోవెల పూజారి. ఆ యింట పుట్టిన చిన్నది. పేరు పూర్ణమ్మ. కోవెల లోపల వెలసినది బంగరు దుర్గమ్మ. పూజారింట పుట్టినది. పుత్తడిబొమ్మ పూర్ణమ్మ. ఎంత ఐక్యం. ఈ సమన్వయం కొయ్యబొమ్మలమెచ్చే ఆ తల్లిదండ్రులకి

పూర్ణమ్మ సౌందర్యాన్ని "పుత్తడిబొమ్మ" అనడం తప్ప వాచ్యం చేయడు మహాకవి. మధ్యలో ఒకచోట మాత్రం -

పళ్ళను మీరిన తీపుల నడలును
పువ్వులు మీరిన పోడుములున్
అంగము లందున అమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్

ఈ వర్ణన సహృదయుల కోసంకాదు చేయడం. ఆమె ఇక్కడ ఉత్త "పూర్ణ". పుత్తడిలేదు. అయితే ఎవరికోసం చేసెడిది కళ్ళున్నా కానలేని ఆమె తల్లిదండ్రుల కోసం. వాళ్ళవి కొయ్యబొమ్మల మెచ్చుకళ్ళు. అనుకున్నాం కదూ! అందుకే ముసలి మొగుణ్ని చూసేరు ఆమెకు జోడుగా.

ఇక్కడ గురజాడ కథకంతటికీ ఆయువుపట్టుగా ఓ ముత్యాలసరం కూర్చేడు.

కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడీ
పుత్తడిబొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగుడుకు ముడివేస్రీ

తల్లీ తండ్రీ విడనాడింది నెనరూ న్యాయం-యథా క్రమంగాచూస్తే తల్లి నెనరూ తండ్రి న్యాయమూ విడనాడటం జరిగింది. "కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా

్రుతమ్" అనికదా పెద్దలన్నారు. తల్లికి దృష్టి అల్లుడి సంపద ఆరోగ్యంపైనా వుంటుంది. తన బిడ్డ నూరేళ్ళు కూడు గుడ్డలకు లోటులేకుండా సుమంగళి గా ఉండాలని. అందుకు ఆమె కుండవలసింది నెనరు. తండ్రి తన అల్లుడెంత పేరు ప్రఖ్యాతులున్నవాడు! ఏం చదువుకున్నాడు! అంటూ చూస్తాడు. ఆయన ఆలోచించవలసినది న్యాయం. అట్టి నెనరు న్యాయం వీడి, ఆ తల్లిదండ్రులు చేసిందేమిటి ?

పుత్తడిబొమ్మ పూర్ణమ్మను
ముదుసలి మొగుడికి ముడివేస్రీ.

ఇక్కడ ఆమె పుత్తడిబొమ్మ, పూర్ణమ్మ. చూడండి, ఎంత ఒత్తుగా, నిండుగా ఉన్నదో! మరి వరుడో! ముదుసలి మొగుడు–అన్నీ లఘువులే, విడివిడిగా వదులుగా వున్నాడు. అంటే జీవసత్వాలు అన్నీ ఉడిగినవాడని అర్థం. అలా కాకపోతే కనీసం 'భర్త' అనేనా ప్రయోగించేవాడుగా మహాకవి. ఆ లక్షణం ఆ ముదుసలిలో లేందే ఎలా అంటాడు? అట్టివాడితో 'ముడివేస్రీ' ఇక్కడ క్రియ చూడండి, 'వేసిరి' అనే గ్రాంధిక రూపానికి విశాఖజిల్లా వ్యావహారికంగాచూస్తే "వేసేరు, వేసారు" అనాలి. మరో ప్రాంతంగా అంటే, వేసినారు, ఇత్యాదిగా అనాలి. ఇలా–అలా–కాకుండా ఎవరూ వేయని "వేస్రీ" అనడంలో ఎవరూ చేయని–చేయకూడని "క్రియ" చేసేరు అని ధ్వనింపజేసేడు మహాకవి. కాసుకోసం పుత్తడి నెవరైనా ఇస్తారా? ఆ "క్రియ" ఎవరూ అలా వేయరు. ఈ క్రియ (పెళ్ళి) ఎవరూ ఇలా చేయరు. ఇలాంటి క్రియాప్రయోగాలు, గురజాడ తన మొత్తం ముత్యాలసరాలలో పూర్ణమ్మలోతప్ప మరెక్కడా చేయలేదు. తనను కొనిపోవచ్చిన "పతి"తో పంపడానికి పదినెలు "పూర్ణమ్మ"ను తయారుచేస్తున్నారు.

పసుపు రాసిరి బంగరుమేనికి
జలకము లాడెను పూర్ణమ్మ!
పదినెలు పూర్ణకు పరిపరి విధముల
నేర్పులు మెరసీ కైచేస్రీ.

## మతం

"సమాజం నుండి మతమును నిర్మూలించ ప్రయత్నించడం వ్యర్థప్రయాస. అట్టి ప్రయత్నం ఫలిస్తే సమాజమే నాశనమవుతుంది. మూఢ నమ్మకాలు, దురాచారాలు, ఇతర ... లు ప్రతి యుగంలోను మతంలో ప్రవేశించి దానిని తాత్కాలికంగా కలుషితం చేస్తాయి. అవి వస్తాయి, పోతాయి. కాని మతం మాత్రం మిగులుతుంది. ఎందువల్లనంటే విస్తృతమైన అర్థంలో ప్రపంచంయొక్క అస్తిత్వం మతంపై ఆధారపడి వుంది. మతం యొక్క నిర్వచనం దైవశాసనానికి బద్ధులై వుండడం. భగవానుడు, అతని శాసనం – రెండూ ఒకటే.

నా దృష్టిలో దైవం ఒక వ్యక్తి కాదు. నాకు సత్యమే దైవము. పరమేశ్వర సాక్షాత్కారమే మానవుని చరమ లక్ష్యం. మానవుని కార్యకలాపాలన్నింటికీ ఆ లక్ష్యమే ధృవతార కావాలి – కనుక దేవుని సేవ, మానవాళిసేవ నా మతం"

బంగరుమేని పూర్ణమ్మకు పసుపురాసి, కైసేస్రీ. అలంకారాలు అవసరంలేని అమ్మాలమిన్నకు అలంకరించడంలోని అనౌచిత్యాన్ని కైసేస్రీ అనే ఎక్కడా చేయని ప్రయోగంతో ధ్వనింపజేసేడు. నిజమేకదా, "కిమివ హిమధురాణాం మండనం నాకృతీనామ్". ప్రకృతి మధురంబులకు వేష రచనలేల ?

అదేవిధంగా కానుకు లోనై నెనరూ న్యాయం వీడి ముదుసలి మొగుడితో ముడివేసిన తల్లి తండ్రీ తమకు మొక్కిన పూర్ణమ్మను దీవించ్రీ. పెళ్ళయినపిల్ల నమస్కరిస్తే ఎవరైనా "దీర్ఘసుమంగళీభవ" అనికదా అంటారు. వీళ్ళేమనివుంటారు! అదేనా! వాళ్ళు చేసిన చేష్టనూ దీవనకూ పొత్తులేదని తెలిసిన వుత్తడిబొమ్మ దీవెన వింటూ ఫక్కున నవ్వింది. ఛెళ్ళుమన్నట్లు అయివుంటుంది వాళ్ళకు. చివరకు తల్లికూడా కంటతడి పెట్టిందేమోకానీ. కానుకులోనై అల్లుని తలుచుకు ఆనందించింది కొయ్యకళ్ళ అయ్యొక్కడే!

తానూ దుర్గ ఒకటేనని ఆ తల్లిలో కలిసిపోవడమే తని గమ్యమని తెలుసుకుంది పూర్ణమ్మ కాబట్టే–ఇంట్లో వాళ్ళతో–నలుగురు కూచుని నవ్వే వేళల నాపేరు తలవండి దుర్గను కొలవండి మీకన్న బిడ్డలకొకతెకు నాపేరు పెట్టండి అని సూచించింది. పూర్ణమ్మ యింటికిరాదాయె అనడంతో కొందరిక్కడ పూర్ణమ్మ ఆత్మహత్య చేసుకుంది అంటారు (ఇప్పటిలా). కాని రమణారెడ్డి మాటలలో, "పూర్ణమ్మ చనిపోలేదు. ఆమెది ఆత్మహత్య కాదు. భర్త యింటికి పోవడానికి మారుగా లోకేశ్వరి యింటికి పోయింది" అనడం–యథార్థం. ఇంకా ఆత్మహత్యే ఆమెది అన్నవారికి చిట్టచివరి వాక్యం. "దుర్గను జేరెను పూర్ణమ్మ" అన్నది వాచ్యం.

పోతే చివరకూడా కవి చక్కని "ధ్వని"ని ప్రదర్శించేడు. సాధారణంగా పాంచభౌతికమైన దేహం పంచత్వమొందేటప్పుడు నిప్పు నిప్పులో, గాలి గాలిలో అన్నట్లుగా కలిసిపోతుందంటారు. మరి మన పూర్ణమో!

కన్నులకాంతులు కలవల చేరెను
మేలిమి చేరెను మేనిపసను
హంసల జేరెను నడకల చెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ.

ఇక్కడ కవి–పూర్ణమ్మ సహజ సౌందర్యాన్ని సహృదయులకు సూచిస్తున్నాడు.

కవుల గణనా ప్రసక్తిలో కనిష్ఠికాధిష్ఠితుడైన కవికుల తిలకుడు కాళిదాసు పార్వతి తపోవర్ణనా సందర్భంలో

"పునర్గ్రహీతుం నియమస్థయా తయా
ద్వయేపి నిక్షేప ఇవార్పితం ద్వయం।
లతాసు తన్వీషు విలాసచేష్టితం
విలోలదృష్టిం హరిణాంగనాసుచ"

తపోనిష్టలోవున్న పార్వతి విలాసచేష్టలు అందాకా లతలను పొందేయట విలోల దృష్టి హరిణాంగులను ఆశ్రయించిందట. పూవులలో, పుత్తడిలో పక్షులలో–ప్రకృతిలో అంతటా పూర్ణమ్మే కనబడుతోంది.

ఇలా ఎంతైనా మహాకవుల వాణి ఆలోచనామృతాన్ని అందిస్తూనే వుంటుంది.

నాటి దురాచారాన్ని ఇలా ఎత్తిచూపి రూపుమాపేడు గురజాడ.

నేటి దురాచారాన్ని (వరకట్నం) ఆలా రూపుమాపేది ఏ గురుజాడో!

జయన్తి తే సుకృతినో రససిద్ధా కవీశ్వరాః
నాస్తి యేషాంయశః కాయే జరామరణ జలభయమ్–

“ బాబు దొరికాడా ? ఎక్కడ ? ” ఆతృతగా అడిగారు రాఘవ, దేవకీ ఒకేసారి.

“ ఆ ! దొరికాడు ! ” ఉత్సాహంగా అంది చందన.

“ ఏడి ? ” అన్నాడు రాఘవ చుట్టూ చూస్తూ.

“ గదిలో వున్నాడు... తీసుకురానా ? ”

“ ఊఁ !... ”అన్నాడు రాఘవ అయోమయంగా చూస్తూ. చందన రివ్వున గదిలోకి పరిగెత్తి మరు నిముషంలో వచ్చి వాలింది బాబుతోసహా.




కొయ్యబారిపోయారు దేవకీ, రాఘవ. కారణం ఆమె తీసుకొచ్చింది నిజంగా బాబు కాదు. ఓ పెద్ద రబ్బరు బొమ్మ !

“ ఇడుగో మావయ్యా బాబు ! ....మనం వూరంతా వెతుకుతున్నామా !....వీడు గదిలో ఓ మూల పడుకుని ఏడుస్తున్నాడు. పాపం ! ఆకలిగా వున్నట్టుంది. అమ్మా ! .... కాసిని పాలు తెద్దూ ! ....ఒకటే గుక్క పట్టేస్తున్నాడు.

అబ్బబ్బ ! ఊరుకో నాన్నా !....పాలు వడతాగా ఆదిగో అమ్మమ్మ తెస్తుంది. ష్ ! ఏడవకు మరీ ! నా తండ్రివి గదూ ! .... ” అంటూ బొమ్మని బుజా నేసుకుని చిచ్చికొట్టసాగింది చందన.

## జరిగిన కథ

మురళితో చందన పెళ్ళి 'బాబు' మూలంగా ఆగిపోతుంది. బాబు ఇంట్లో అందరికీ చేరు వౌతాడు. చందన ఫోన్ చెయ్యడంతో బాబు తండ్రి జయంత్ వస్తాడు. బాబుని తెమ్మని నౌకర్లతో చెప్పిన చందనను బాబు కన్పించటం లేదన్న వార్త నిర్ఘాంత పరుస్తుంది. బాబు విషయం గురించి నౌకర్లను నిలవేసిన చందన నరసమ్మ చెప్పిన విషయం విని స్థాణువై పోతుంది. మురళికి వచ్చిన ఉత్తరంతో రాఘవ, మురళి, చందన శ్రీనగర్ పెళ్తారు. అక్కడ ఆమెను ట్రీట్ చేసిన డాక్టర్ 'బాబెలా ఉన్నాడు' అని పలకరించటంతో బిత్తరపోతుంది. రాఘవకూడా ఆ మాటల్నే బలపరచటంతో చందనకు నిజంగానే మతి పోయింది. తల్లిదండ్రులవద్ద ఈ విషయం ఎత్తొద్దని మాట తీసుకుంటాడు రాఘవ. శ్రీనగర్‌నుంచి వచ్చినప్పటినుంచి చందన చాలా మారిపోతుంది. ఆ సమయంలో బాబు గురించి వచ్చిన జయంత్‌ని చూసి రాఘవ ముఖం చిట్లించాడు. శాంతారామ్ గారితో మాట్లాడుతున్న జయంత్‌ని 'వినోద్' అంటూ లతలా చుట్టేసింది చందన. 'మన బాబు కన్పించటం లేదు!' అంటూ ఏడుస్తుంది చందన. అదిచూసి అంతా నిర్ఘాంతపోతారు. డాక్టర్ల సలహా ప్రకారం చందన ఆరోగ్యం దృష్ట్యా జయంత్ అక్కడే ఉండిపోతాడు. అది రాఘవకి నచ్చదు. 'జయంత్ అతి చనువు తీసుకుంటున్నాడని ఇలా అయితే పెండ్లి కాదని, మీకు ఇష్టమయితే నేను చేసుకుంటాన'ని దేవకితో చెప్తాడు రాఘవ. ఇంతలో 'బాబు' దొరికాడంటు సుడిగాలిలా దూసుకొస్తుంది చందన. 'బాబు దొరికాడా!' (ఇక చదవండి)

ఉసూరు మన్నారు దేవకీ రాఘవలు. దేవక్కి దుఃఖం కూడా వస్తోంది.

" అమ్మా! .... తొందరగా పాలు తీసుకురామ్మా! వీడు చేతుల్లో ఆగడం లేదు! .... " అంటూ కాసేపు పిచ్చివాగుడు వాగి—

" అన్నట్టు వినోద్ ఏడీ....కొంపతీసి నన్నొదిలిపోడు కదా! అమ్మో! .... " అంటూ హాల్లోకి పరిగెత్తింది చందన.

కొయ్యబారిపోయినట్టున్న దేవకి తేరుకుని—

" చూశావ్‌గా దాని పరిస్థితి! .... ఇలాంటి దానికి పెళ్ళేమిటి రాఘవా! .... అసలు పెళ్ళి పీటలమీద కూర్చుంటుందన్న నమ్మకం కూడా నాకు లేదు. దాని రాతెలా వుంటే అలా జరుగుతుంది! .... నువ్వేం బాధపడకు!" కళ్ళు తుడుచుకుంటూ అంది.

" కూర్చుంటుంది. అసలు పెళ్ళి అనగానే దాని ఆరోగ్యం బాగైపోతుందని నా కెందుకో చాలా నమ్మకంగా వుంది! .... నీ కెందుకు అదంతా నా కొదిలెయ్! నేను చూసుకుంటాను!"

" కానీ....దాని మూలంగా నీ నిండు జీవితం.... "

" ష్! అలా మాట్లాడకు! చందన ఆరోగ్యం బాగవాలి!....ఆతరవాత నేనేమైనా పరవాలేదు. దానికోసం నేనేం చెయ్యడానికైనా సిద్ధమే!" గంభీరంగా అన్నాడు రాఘవ.

దేవకి కళ్ళలో కృతజ్ఞత తొంగి చూసింది.

*

మర్నాడు విషయం విన్న శాంతారామ్ కొయ్యబారి పోయాడు.

" ఈ పరిస్థితులలో చందనకి పెళ్ళా?" అన్నాడు ఆశ్చర్యంగా.

" అదే నేనూ అన్నాను....కానీ....చందన ఆరోగ్యం దృష్టిలో ఉంచుకుని...." నసిగింది దేవకి.

"కానీ...."

"నువ్వేం ఆలోచించకు బావా !....ప్రస్తుత పరిస్థితుల్లో చందనకి పెళ్ళితప్ప మరోమార్గం లేదని మా డాక్టర్ ఫ్రెండ్ అన్నాడు ...నాకూ అదే మంచిదనిపిస్తోంది !.... అందుకే....క్లుప్తంగా నాకూ, చందనకీ పెళ్ళి జరిపించెయ్ !...." అన్నాడు రాఘవ.

ఆలోచనలో పడ్డాడు శాంతారామ్.

అప్పుడే "డేడీ !...." అంటూ విసురుగా వచ్చింది చందన.

"ఏమ్మా ?" చిన్నగా నవ్వి అన్నాడు శాంతారామ్.

"నేనూ వినోద్ శ్రీనగర్ వెళ్తాం !" అందితేలిగ్గా.

ఘపడ్డారంతా.

"రేపే మా ప్రయాణం ! మావయ్యా ! మాకు.... ప్లేన్ టికెట్స్....రిజర్వ్ చేయించు !" రాఘవతో అంది చందన.

"ఇప్పుడు శ్రీనగర్ ఎందుకమ్మా ?" బుజ్జగిస్తు న్నట్టు అన్నాడు శాంతారామ్.

"చాలా పనులున్నాయి !....వినోద్ నేను చెప్తే రానంటున్నాడు ! ....నువ్వు చెప్పు డేడీ !"....గారాబంగా అంది చందన.

ఏం చెయ్యాలో తోచలేదాయనకి. కూతురుకి నచ్చ చెప్పాలని ప్రయత్నించి ఓడిపోయాడు. తప్పనిసరిగా జయంత్‌ని పిలిపించాడు.

"ఏమిటి సర్ ?" గంభీరంగా అన్నాడు జయంత్.

విషయం చెప్పాడు శాంతారామ్.

జయంత్ ముఖం మరింత గంభీరంగా అయిపోయింది.

"అయామ్ సారీ ! నేనింకెక్కడికీ వెళ్ళలేను సర్ !" నిర్మొహమాటంగా అన్నాడు.

"ప్లీజ్ ! మిస్టర్ జయంత్ ! .... ఈసారికి...."

"అయామ్ వెరీ సారీ ! శాంతారామ్‌గారూ ! నేను పనీ పాటా లేని ఆవారా వెధవని కాదు ! .... ఇప్పటికే



నా పన్లు కుంటుపడ్డాయి. ఇన్నాళ్ళూ మీ మాట తీసెయ్య లేక వున్నాను. కానీ, ఇంక వుండలేను ! .... "

"అది కాదు జయంత్ ! .... "

"ప్లీజ్ ! నన్నొదిలెయ్యండి ! .... ఓ మూల బాబు కనిపించలేదని కృంగిపోతూనే మీకు సహాయంగా ఉన్నాను. ఇంక మీ అమ్మాయితో కాశ్మీర్లు, ఊటీలు కూడా తిరగమంటే ఎలా ? .... కాస్త నన్ను కూడా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి !" కాస్త కఠినంగా అన్నాడు జయంత్.

శాంతారామ్ మొహం పాలిపోయింది. ఏదో అనబోతుంటే—

"ఆపను బావా ! .... మనకోసం పన్లన్నీ మానుకుని ఆయనున్నండమనడం భావ్యం కాదు ! అంతే కాదు !

చందన ఈయన్ని చూసి వినోద్ అనుకుంటోంది. అందుకే....ఈయనిక్కడున్నంత కాలం దాని ఆరోగ్యం కూడా బావుండదని నా ఉద్దేశం ? .... నా మాట విని ... జయంత్‌గార్ని వెంటనే పంపెయ్యి ! " అన్నాడు రాఘవ.

" కానీ చందన శ్రీనగర్ వెళ్ళాలని గొడవ చేస్తోంది ! " ఏదో ఆలోచిస్తూ అన్నాడు శాంతారామ్.

" దానికేం పంపు ! "

" ఒంటరిగానా ? "

" తోడు నే వెళ్తాను ! " అన్నాడు రాఘవ చందనకేసి ఆప్యాయంగా చూస్తూ.

" ఒద్దు ! .... నాకు వినోదే కావాలి ! " అంతవరకు మౌనంగావున్న చందన గట్టిగా అంది.

కొర కొరా చూశాడు రాఘవ.

అదేం పట్టించుకోకుండా బొమ్మని బుజానేసుకుని వెళ్ళిపోయింది.

మొఖాలు చూసుకున్నారంతా.

చాలాసేపు చందనతో ఎవరెళ్ళాలి అని తర్జన భర్జన పడ్డారు. అప్పుడే—

" అబ్బబ్బ ! .... ఇంకా ఇక్కడే వున్నావా డియర్ ! ఓసారిలా రా ! .... బాబు ఒకటే ఏడుపు ! కాసేపు ఎత్తుకుందూ ! .... " బొమ్మని అతని కందిస్తూ అంది చందన.

ఇబ్బందిగా చూశాడు జయంత్.

" ఊఁ ! ఎత్తుకో ! "

తప్పనిసరిగా బొమ్మని అందుకున్నాడతను.

చందన మోహం వికశించింది.

" అమ్మయ్య ! బాబు ఏడుపు మానేశాడు ! చూశావా! వాడికి నాన్నంటే ఎంత ప్రాణమో ! " అంది ఆనందంగా.

తరువాత శ్రీనగర్ ప్రయాణం కేన్సిల్ చెయ్యాలని ఎంతగానో ప్రయత్నించాడు శాంతారామ్. అయితే చందన ససేమిరా ఒప్పుకోలేదు. ప్రయాణమయ్యేదాకా ఒకటే తొందరపెట్టింది.

ఏంచెయ్యాలో తోచలేదు శాంతారామ్‌కి. ఆమెని అప్పటికి శాంతపరచి మర్నాడు ఫేమిలీ డాక్టర్ని కన్సల్ట్ చేశాడు. ఆయనకూడా.

" ఓసారి పంపితేనే మంచిదనిపిస్తోంది. అందువల్ల మనకి వచ్చే నష్టమూలేదు. అసలు ఆ వినోద్‌తో పరిచయం ఆ కాశ్మీర్‌లోనే అయివుంటుంది....ఈ జయంత్ గారు అచ్చం ఆ వినోద్‌ని పోలివుండచ్చు !....అందుకే చందన ఇలా ప్రవర్తిస్తోంది. ఏది ఏమైనా మీరు ఓసారి ఈ జయంత్‌గార్ని తోడిచ్చి శ్రీనగర్ పంపితేనే మంచిదని పిస్తోంది " అన్నాడు డాక్టర్ ఊహాగానాలుచేస్తూ.

" కానీ. జయంత్‌గారిక్కడరదంటున్నారు ! .... మెల్లగా అన్నాడు శాంతారామ్.

" పోనీ. ఏదో మంచిమాటలు చెప్పి రాఘవతో పంపండి ! " పక్కనే ఉన్న రాఘవకేసి చూస్తూ అన్నాడు డాక్టర్. రాఘవ ముఖం వికశించింది.

రాఘవతో చందనని పంపేలా ఏర్పాటయింది. జయంత్ ఇంటికి బయల్దేరాడు. అయితే చందన అతన్ని వెళ్ళనివ్వలేదు.

ఇల్లంతా చిందర వందర చేసింది. కనిపించినవన్నీ విసిరేసింది. గోలగోలగా అరిచింది.

బిత్తరపోయిన జయంత్ తప్పనిసరిగా ఆమెతో శ్రీనగర్ వెళ్ళడానికి ఒప్పుకున్నాడు.

చందన మొఖం దివిటీలా వెలిగిపోయింది. రాఘవ పోరడంతో ఆమెతో రాఘవకూడా వెళ్ళడానికి నిర్ణయించారు.

ఏ కళనుందో చందనకూడా ఎలాంటి అబ్జెక్షను పెట్టలేదు.

ప్రయాణం డేట్ నిర్ణయించారు.

*    *    *    *

ఉదయం పదిగంటలయింది.

చందన శ్రీనగర్‌లోని ఓ గెస్ట్‌హౌస్‌లో పడుకుని బొమ్మతో ఆడుకుంటోంది. జయంత్ అప్పుడే బైటికి ఎక్కడికో వెళ్ళాడు. తలుపు దగ్గరగా వేసుంది.

తలుపు మెల్లగా తెరుచుకుంది.

తలెత్తి ఓసారి చూసి తిరిగి బొమ్మతో ముచ్చట్లు సాగించింది చందన.

మెల్లగా దగ్గరి కొచ్చాడు రాఘవ.

" చందనా ! " అన్నాడు మృదువుగా.

" ఏవిఁటి మావఁయ్యా ? " నవ్వుతూ చూసింది చందన. రాఘవ ఆమె మంచం పక్కగా కూర్చున్నాడు. అతనితో వచ్చిన మరో వ్యక్తి కాస్త దూరంగా నిల్చున్నాడు.

క్షణం మౌనం తర్వాత—

" చందనా ! " అన్నాడు రాఘవ మెల్లగా.

" ఊఁ ! "

" నీ కో సంగతి తెలుసా ? "

" ఏవిఁటి మావఁయ్యా ? "

" నీ బాబుని ఎవరు ఎత్తుకుపోయారో తెలుసా ? " కాస్త రహస్యంగా అన్నట్టు అన్నాడతను.

" ఛ ! నా బాబుని ఎవరో ఎత్తుకుపోవడం ఏవిఁటి మావఁయ్యా ! .... ఇదుగో ! నా దగ్గరే వున్నాడుగా " మురిపెంగా బొమ్మకేసి చూసుకుంటూ అంది చందన.

" ఛ ! .... వీడు నిజంగా నీ బాబు కాదు ! వట్టి బొమ్మ ! చూడు ! కొట్టినా ఏడవడు ! ఆకలని అడగడు ! అసలు నిన్నెప్పుడైనా అమ్మా అని పిల్చాడా ? " అనునయంగా అన్నాడు రాఘవ.

" ఉఁహుఁ ! " బిక్క మొహంతో అంది చందన.

" మరందుకే....వీడు నీ బాబు కాడు ! నీ బాబు వేరేచోట వున్నాడు. "

" ఎక్కడ ? "

" వినోద్ దగ్గిర ! "

" వినోద్ దగ్గరా ? మరైతే ఇంకేం .... అడిగితే ఇచ్చేస్తాడు ! .... " తేలిగ్గా అంది చందన.

" ఉఁహుఁ ! ఇవ్వడు ! "

" ఏం ? " భయంగా అందామె.

" నీ ఆస్తి కాజెయ్యడానికి. " రహస్యంగా అన్నాడు రాఘవ.

" అంటే ? " అర్థం కానట్టు చూసింది చందన.

" అంటే....నీ ఆస్తి దాదాపు నలభై లక్ష లుంటుంది కదా....అందుకే నీ బాబుని దాచేసి....బోల్డు డబ్బిస్తేనే గానీ ఇవ్వనని అంటున్నాడతను "

" ఓస్ ! డబ్బే కదా ! .... ఇచ్చేద్దాం ! " తేలిగ్గా అంది చందన.

గతుక్కుమన్నాడు రాఘవ.

" అది కాదు చందనా ! వాడు పరమ దుర్మార్గుడు ! ఎలాగైనా నిన్ను ప్రేమించినట్టు నటించి నిన్ను పెళ్ళి చేసుకుని నీ ఆస్తి మొత్తం కాజెయ్యాలని చూస్తున్నాడు రాస్కెల్ ! వాడి ఆట సాగనివ్వకూడదు ! " అర్థం అయ్యేలా చెప్పాలన్నట్టు అంతవరకు దూరంగా నిల్చున్న వ్యక్తి దగ్గరగా వచ్చి అన్నాడు.

అతను మురళి !

అయితే మురళిని చందన గుర్తించలేదు ! భయంగా బొమ్మని గట్టిగా పట్టుకుని—

" నువ్వెవరు ? " అంది.

" తరవాత చెప్తాను. ముందిది చెప్పు ! బాబు నీక్కావాలా వద్దా ? " అన్నాడతను.

" కావాలి ! " అన్నట్టు తలూపింది చందన.

" అయితే నువ్వో పని చెయ్యాలి ? "

" ఏవిఁటి ? ఏం చెయ్యాలి ? "

" చెప్తాను : .... చేస్తావుగా ? "

" ఆ ! .... .... "

" వెంటనే రాఘవని పెళ్ళిచేసుకోవాలి ! "

" ఛ ! మావయ్యనా ? "

" అవును ! మావయ్యనే ! రాఘవ చాలా మంచి వాడు : పెళ్ళి కాగానే నీ బాబుని వెతికి తీసుకొచ్చి నీ కప్ప చెప్తాడు ! అందుకే రాఘవని పెళ్ళిచేసుకో ! " అనునయంగా అన్నాడు మురళి.

క్షణం ఆలోచనలో పడింది చందన.

" పెళ్ళి కాకుండానే వెతికి తేవచ్చుగా ? " హటాత్తుగా అంది.

గతుక్కుమన్నారిద్దరు మగాళ్ళు.

మురళే తేరుకుని—

" నిజమే అనుకో : కానీ, పెళ్ళయితే నీ కొడుకు రాఘవ కూడా కొడుకవుతాడు. అందుకే కచ్చితంగా బాబుని వెతుక్కొస్తాడు. "

" ఇంకా వెతకడం ఎందుకు ? వినోద్ దగ్గరున్నా డన్నారుగా ? " అమాయకంగా అంది చందన.

" అవుననుకో ! కానీ వినోద్ బాబుని ఎక్కడ దాచాడో తెలియదుగా : అందుకే ఎలాగైనా ఆ రహస్య స్థలం కనుక్కొని బాబుని తీసుకొచ్చి నీ కప్ప చెప్తాడు ! " నమ్మకంగా అన్నాడు మురళి.

" నిజమేనా ? నిజంగా వెతికి తెస్తాడా ? "

" ఓ ! నిజంగా వెతికి తెస్తాను ! " ఉత్సాహంగా అన్నాడు రాఘవ.

" సరే ! అయితే నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను మావయ్యా ! "

" థాంక్యూ ! .... థాంక్యూ చందనా ! " ఆమెన్ని చేతులతో చుట్టేస్తూ అన్నాడు రాఘవ.

"ఛ ! వుండు ! బాబు నలిగిపోతున్నాడు" విసుక్కుంది చందన.

" సారీ ! .... అయితే, జయంత్ వస్తే వెంటనే వెళ్ళిపొమ్మని చెప్తావుగా ? " ఆమె నొదిలి మెల్లగా అన్నాడు రాఘవ.

" జయంతా ? "

" సారీ ! జయంత్ కాదు ! వినోద్ ! అతనొస్తే పంపేస్తావుగా ? "

" ఓ ! ఇంక మీ రెళ్ళండి ! " బాబుని కాళ్ళమీద పడుకోబెట్టుకుని జోల పాట మొదలెట్టింది చందన.

రాఘవ, మురళి మెల్లగా హాల్లోకి నడిచారు.

" ఇంక నేను పోతాను ! " మెల్లగా అన్నాడు మురళి.

" అప్పుడేనా ? "

" నా పనైందిగా ? "

" ఇంకా పూర్తిగా అవందే : " నవ్వాడు రాఘవ.

"సరే ! ఈ కబుర్లకేంగానీ నా డబ్బు ఎప్పుడిస్తావ్ ? " సీరియస్‌గా అన్నాడు మురళి.

" ఇంకా డబ్బు చేతికి రాందే ! "

" అంటే నీ పెళ్ళయి, నీ మావగారి డబ్బు చేతికొస్తేనేగానీ నా బాకీ తీర్చవా ? " ముఖం చిట్లించి అన్నాడు మురళి.

" మరి అంత డబ్బు నా దగ్గ రెక్కడుంటుంది మురళీ ! "

" డబ్బు లేనప్పుడు రెండు లక్షలు ఇస్తానని ఎందుకు ఒప్పుకున్నావ్ ? " ఆవేశంగా అన్నాడు మురళి.

" ఆవేశపడకు మురళీ ! .... ఎట్టి పరిస్థితిలోనూ నీ డబ్బు ఎక్కొట్టను ! .... డబ్బు చేతికి రాగానే తీర్చేది ముందు నీ బాకీనే ! " మళ్ళీ నవ్వాడు రాఘవ.

" నీకు డబ్బొచ్చే దెప్పుడు నువ్వు నా బాకీ తీర్చే దెప్పుడూ ! ఛ ! .... నీ మాటలు నమ్మి బంగారం లాంటి సంబంధం ఒదులుకున్నాను.

ప్రేమించిన చందననీ, లక్షలాస్తినీ, నీ పరం చేస్తున్నాను ! నా అంత మూర్ఖుడుండడు ! " రుసరుస లాడాడు మురళి.

ఫక్కున నవ్వాడు రాఘవ.

" ఎందుకా నవ్వు ? " చిరాగ్గా అన్నాడు మురళి.

" నీ అమాయకత్వానికి ! " మళ్ళీ నవ్వాడు రాఘవ.

" ఇందులో అమాయకత్వం ఏవుంది ? ఈ ఆస్తీ, చందన నాకు చెందాల్సినవి కావా ? ఏదో చిన్నప్పట్నించీ చందనని ఆరాధిస్తున్నాననీ, ఆమె లేందే బతకలేననీ వాపోతుంటే—పోనీ గదా అని నేనింత త్యాగం చేశాను. నువ్వేమో........"

" త్యాగం కాదు మిస్టర్ మురళీ ! సమయస్ఫూర్తి ! నిజానికి నువ్వు చందనని ప్రేమించనేలేదు ! .... ఆమె ఆస్తి కోసం నక్కలా కాచుకున్నావ్ !

నీకు అదివరకే చాలామంది అమ్మాయిలతో సంబంధం వుందనీ, ఆ చరిత్రంతా నాకు తెలుసనీ నేను సాక్ష్యాధారాలతో చందనకి చెప్తాననీ, ఆపై చందన నీ మొహంకేసైనా చూడదనీ నీకు బాగా తెలుసు ! .... అందుకే .... కనీసం నేనిస్తానన్న రెండు లక్షల రూపాయలైనా మిగుల్తాయనీ ఈ నాటకానికి ఒప్పుకున్నావ్! అంతేగానీ ఇది త్యాగమూ కాదు ! నామీది జాలీ కాదు ! " వ్యంగ్యంగా అన్నాడు రాఘవ.

మురళి మొహం తెల్లగా పాలిపోయింది. వెంటనే కళ్ళలో ఎరుపు జీర చోటుచేసుకుంది.

" అంటే మృష్టి రెండు లక్షల కోసం ఆశపడి నానా యాతనలు, అవమానాలూ భరించి, మా నాన్న చేత కూడా నాటకం ఆడించానంటావ్ ! అంతేనా ? " అన్నాడు ఆవేశంగా.

" నువ్వు నాటకం ఆడినా, మీ నాన్న దానికి సమర్థించినా, సంబంధంలేని ఓ పసివాణ్ణి పావుగా వాడినా, ఇంత నాటకానికి నేను సూత్రధారినైనా అన్నింటికీ ఏదో ఒక స్వార్థం వుంటుంది బ్రదర్ ! అనవసరంగా ఆవేశ పడకు ! " తాపీగా అన్నాడు రాఘవ.

" రాఘవా ! " అరిచాడు మురళి.

" ఏవిఁటి ? "

" నీకు విశ్వాసం లేదు ! "

" అవును ! "

" దుర్మార్గుడివి ! "

" థాంక్యూ ! "

" ఏవిఁటీ గోల ! ఓ మూల బాబు నిద్రపోతుంటే ? " విసుక్కుంటూ వచ్చింది చందన.

( స శే షం )

---

"పుస్తకమును మస్తకములో చేర్చాలిగాని, మస్తకమునే పుస్తకముగా మార్చరాదు"

- సత్యసాయిబాబా

"సంతృప్తిలేని జీవితానికి శాంతిలేదు. అసంతృప్తిలేని జీవితానికి వృద్ధిలేదు ".

— నార్ల

---

మినీ కథ

# మరీ ఇంత ఇదా!?

ఓ రచయిత అర్ధరాత్రి వున్నట్టుండి "చచ్చిపోయింది .... చచ్చిపోయింది". అని అరుస్తూ ఇంటి బయటకొచ్చాడు. ఆ అరుపులు, ఏడుపులు విన్న చుట్టుప్రక్కలవారు వెంటనే బయటకొచ్చి "ఎవరు చచ్చిపోయింది ఎక్కడ, ఏమిటి?" అని ఆదుర్దాగా ముక్తకంఠంతో అడిగారు రచయితని. "లత చచ్చిపోయింది" అని పెద్దపెట్టున ఏడుస్తూ చెప్పాడు రచయిత. లత అనే అమ్మాయి ఎవరో అక్కడున్న ఎవరికీ అర్థంకాక "లత ఎవరు?" అని అడిగారు. దానికి రచయిత సూటిగా సమాధానం చెప్పకుండా, లత చాలా మంచిదండి, మంచి గుణవంతురాలు, చాలా అందమైనదికూడా, నిర్దాక్షిణ్యంగా చచ్చిపోయింది, అంటూ భోరున ఏడుస్తూనే వున్నాడు. ఇలా చెబితే ఎవరికి గనుక అర్థమవుతుందీ అందుకే అక్కడున్న ఎవరికీ అర్థం కాలేదు.

అక్కడ గుమిగూడిన జనం రకరకాలుగా గుసగుసలాడుకొంటున్నారు. వాళ్ళ భార్య పేరేమిటి? వాళ్ళ అమ్మాయి పేరేమిటి? అని ఒకరి నొకరు ప్రశ్నించుకుంటున్నారు. అందులో కొంతమంది ఎవరు అనే విషయాన్ని వదిలివేసి 'ఎక్కడ? ఎలా' అని ప్రశ్నించారు. "ట్రంకు రోడ్డుమీద బస్సు ప్రమాదంలో...." అంటూ మరింత, గట్టిగా ఏడుస్తున్నాడు రచయిత. ఈ సమయంలో ఇంకా ప్రశ్నించటం మంచిదికాదని కొంతమంది వాహనాలున్నవాళ్ళు గబగబా ట్రంకురోడ్డు మీదకు వెళ్ళారు. మరి కొంతమంది రచయితను బాధ పడకండి అంటూ ఓదారుస్తున్నారు. ఇంతలో రచయిత భార్య, కూతురు చుట్టుప్రక్కల కొంతమంది ఆడవాళ్ళు సెకండ్ షో సినిమానుంచి ఇంటికొచ్చారు. అంతమంది జనాన్ని ఒక్కసారిగా చూసేసరికి గుండె గుభేలుమని, కంగారుగా భర్త దగ్గర కెళ్ళింది. భర్త ఏడుపు చూడలేని భార్య ఏదో జరగరాని ప్రమాదం జరిగివుంటుందని ఆమె కూడా ఏడుపు మొదలుపెట్టింది. తల్లిదండ్రులు ఏడుస్తోంటే కూతురు సంగతివేరే చెప్పక్కర్లేదు. ఇదంతా చూసిన చుట్టుప్రక్కల అమ్మలక్కలు బాధను ఆపుకోలేక వాళ్ళుకూడా మొదలుపెట్టారు. రచయిత భార్య, భర్తని "ఏమిటండీ.... ఏమయిందండీ" అంటూ ఏడుస్తూనే అడిగింది. "లత చచ్చిపోయింది" అని బొంగురుపోయిన కంఠంతో చెప్పాడు. తమ బంధువర్గంలో లత అనేవారు ఎవరూ లేకపోవటంచేత "లత ఎవరండీ" అని ఒకటికి నాలుగుసార్లు అడగ్గా "ప్రకాష్‌కు కాబోయే భార్య" అని చెప్పాడు కొంత ఏడుపు తగ్గించి. ప్రకాష్ ఎవరూ? అని ప్రజలు ఆదుర్దాగా అడిగారు. "సోమశేఖరం కొడుకు" అని చెప్పాడు. "సోమశేఖరం ఎవరయ్యాబాబు" అని ప్రజలు విసుగ్గా అడిగారు. కొంత స్పృహలోకి వచ్చిన రచయిత "నా నవలలోని ఒక పాత్ర" అని చల్లగా చెప్పాడు.

ఆ మాటవిన్న ప్రజలు ఆగ్రహం పట్టలేక రచయితని కొట్టబోయే పరిస్థితికొచ్చి.... "పేటలో వాడివి కాబట్టి వదిలేస్తున్నాం. లేకపోతే ఏం చేసేవాళ్ళమో! ఏం అరుపులు, ఏం ఏడుపులయ్యా, మా నిద్రంతా పాడు చేశావు కదయ్యా. నీ నవల కాదుగానీ, నువ్వు ఎంత లీనమై నవల వ్రాస్తోంటే, మాత్రం మరీ ఇంత ఇదా! చాలు చాల్లే వెళ్ళవయ్యా" అంటూ అడ్డమైన బూతులుతిట్టి ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

భార్యా, కూతురూ సిగ్గుపడి అప్పటికే లోపలకెళ్ళిపోయారు.

ఇంట్లోకెళ్ళిన రచయిత, భార్య తిట్లు భరించలేక ఆ రాత్రికి నవల రాయటం ఆపి ముసుగుపెట్టి పడుకున్నాడు.

— 'భవిష్య'

# అభిప్రాయవేదిక

" డా॥ అంబేత్కర్ చిత్రం బాగున్నది. ప్రచురింప బడిన వ్యాసాలు, పెట్టెగట్టి ప్రకటించిన ముఖ్య విషయాలు చాలా విలువైనవి. "

— యం. ఆర్. అప్పారావు
మాజీ ఉపాధ్యక్షులు, ఆంధ్రవిశ్వవిద్యాలయము

" శ్రీవాణి పత్రికను సలక్షణంగా తీసుకొనివస్తున్నారు. చెత్త లేదు. రచనలు చదువదగినవిగా వున్నాయి. అందుకు నా అభినందనలు. "

— డి. రామలింగం, హైద్రాబాద్

" ఆసక్తికరమైన విషయాలను అందిస్తూ, విజ్ఞాన దాయకంగా వున్నది. సాహిత్య సాంస్కృతిక వ్యాసాలు ఆకర్షణీయముగా వున్నవి. "

— గోపరాజు సాంబశివరావు, గుడివాడ

" అమృతవాణి, విప్లవవాణి, బాలవాణి మొదలైన చక్కని శీర్షికలతో ముచ్చటగొలుపుతున్న 'శ్రీవాణి' అవశ్య పఠనీయం అనడం అత్యుక్తి కాదు. అభినందనలు."

— చల్లా రాధాకృష్ణశర్మ, మదురై

" శ్రీవాణి తెలుగు పత్రికారంగంలో ధృవతారగా వెలుగొందగలదని నా ఆకాంక్ష "

— యన్. నవకుమార్, బుచ్చిరెడ్డిపాలెం

" శ్రీవాణి పత్రిక ఎంతో బాగుంది. ప్రతి నెలా శ్రీవాణి చూడాలని తపన. అందుచేత సంవత్సర చందా కట్టాను. "

— డా॥ వి. సిమ్మన్న, రీసర్చిస్కాలర్, వాల్తేర్

" శ్రీవాణి పత్రికను గత మూడు నెలలుగా చదువు తున్నాను. సాహిత్యపరంగావున్న ఈ పత్రిక నన్నుబాగా ఆకట్టుకుంది. "

— యస్. వి. యం. శర్మ, మాగల్లు

" శ్రీవాణిని చూడగానే నాకు హేమచం ద్రపూర్వకవి శ్లోకమొకటి మనస్సులో మెదిలింది.

సాంఖ్య భౌతిక చార్వాక మీమాంసక దిగంబరాః
సౌగతాప్తేపి దేవి ! త్వాంధ్యాయంతి జ్ఞానహేః

దేవి శ్రీవాణి అంత గొప్పది. "

— తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు, మద్రాసు

" డా॥ అంబేత్కర్ వ్యాసం, కూచిభట్లవారి అమృత వాణి, ఎన్నికల సంస్కరణలు, బాలవాణి శీర్షికలు చాలా బాగున్నాయి. ప్రజాస్వామ్యంలో 'బుల్లెట్' ద్వారా ఏమీ సాధించలేము, 'బ్యాలెట్' ద్వారానే సాధించవచ్చునని వ్రాసిన సంపాదకీయం వన్నెంతో ఆకర్షించింది. "

— వి. శ్రీహరిరావు, చిలకలపూడి

" ప్రముఖ సాహిత్య పత్రికలు తమ సమగ్రతను, స్వచ్ఛతను కోల్పోయిన ఈ రోజులలో శ్రీవాణి రాక మాలాంటి సాహితీప్రియుల గుండెల్లో అమృతం చిలికించింది. "

— కె. చంద్రప్రతాప్, తిరువూరు

" శ్రీవాణి పత్రిక మాకెంతో సంతృప్తిని కలిగించు చున్నది. భారతీయ సంస్కృతికి దర్పణం శ్రీవాణి "

— బి. ఉషారాణి, గుంటూరు

" జాతీయ సమైక్యత సాధించుటకు ఆధ్యాత్మిక, నైతిక విలువలు పెంపొందించే సాహిత్యం అవసరమని రాధాకృష్ణ పండితులు పేర్కొనినట్లుగా శ్రీవాణి ద్వారా ఉత్తమ సాహిత్యవ్యాసములు అందించుచున్నందుకు అభినందనలు"

— కొంగర దుర్గాప్రసాద్, చంద్రాపురం

" పత్రికను, అందులో సాంస్కృతిక మాసపత్రికను నడపడం కష్టమైన ఈ రోజులలో, మంచి రచనలను ఆహ్వానించి శ్రీవాణిని చక్కగా రూపుదిద్దుతున్నందుకు అభినందనలు "

— వడవి మరిదేశ్వరరావు, హైద్రాబాద్